# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమలద్వారా మానవజాతి సామాజిక నైతిక ఆధ్యాత్మిక అభివృద్ధికి అర్పితము.

సంపుటము 34 | నవంబరు 1991 | సంచిక 11

విషయసూచిక



1991 నవంబరు నెలలో ప్రశాంతినిలయంలో జరుగు కార్యక్రమాలు

నవంబరు 22: 8 A.M. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ జనార్దన్‌రెడ్డిగారిచే "శ్రీ సత్యసాయి జనరల్ హాస్పిటల్" ప్రారంభోత్సవం.

10 A.M. భారతదేశ ప్రధాని శ్రీ పి. వి. నరసింహారావుగారిచే "శ్రీ సత్యసాయి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హైయర్ మెడికల్ సైన్సెస్ హాస్పిటల్" ప్రారంభోత్సవం

3 P.M. విద్యాగిరి వ్యూ స్టేడియంలో "శ్రీ సత్యసాయి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హైయర్ లర్నింగ్" యొక్క 10వ స్నాతకోత్సవము. భారత ప్రధాని శ్రీ పి. వి. నరసింహారావుగారిచే స్నాతకోపన్యాసం. అటుపిమ్మట ఛాన్స్‌లర్ బాబావారు తమ దివ్యసందేశాన్ని అనుగ్రహిస్తారు.

7 P.M. సాంస్కృతిక కార్యక్రమము.

నవంబరు 23: 8 A.M. విద్యాగిరి వ్యూ స్టేడియంలో భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారి 66వ జన్మదినోత్సవం.

5 P.M స్టేడియంలో భక్తి సంగీత కార్యక్రమాలు నిర్వహింపబడును.

శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్టు, ప్రశాంతినిలయం తరపున ప్రమోద్‌కుమార్ సూరిచే, శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ప్రెస్సు ప్రశాంతినిలయంలో ముద్రింపబడి, ప్రచురింపబడినది.
సంపాదకులు : వి. కె. నరసింహన్.

# సత్యసాయి అవతార వైభవం

సత్యధర్మాలు లోకాన చాటు కొఱకు
శాంతి ప్రేమలు నాటంగ జగతిలోన
పుట్టపర్తిని వెలసిన పుణ్యమూర్తి —
సత్యసాయీశు మహిమలు చాటుచుంటి.

ధర్మ సంస్థాపనార్థంబు ధరణిలోన
అవతరించెను శ్రీసాయి ఆదిశక్తి
దుష్టభావాలు పోగొట్టి — శిష్టమతిగ
తీర్చిదిద్దంగ వచ్చెను దేవవిభుడు.

మ॥ అల త్రేతాయుగమందు రాముఁడగుచున్ ఆనందమున్ గూర్చె; ఆ
వల కృష్ణుండిక - ద్వాపరాన వెలసెన్ వర్ధింప భక్తాళి; ఈ
కలిలో పుట్టెను — సత్యసాయి యగుచున్ కష్టాలు పోనెట్ట; భూ
తల మందున్ అల రామకృష్ణులితఁడే! ధ్యానించి పూజింపగన్.

శ్రీమంతంబగు మన భరతఖండము తదితర ఖండముల కంటే కడుంగడు మిన్నయైనది. త్రేతాయుగంలో సరయూనదీ ప్రాంతమందు శ్రీరామచంద్రుడు, ద్వాపర యుగంలో యమునానదీ ప్రాంతమందు శ్రీకృష్ణ పరమాత్ముడు అవతారములెత్తినారు. ఇట్టి పవిత్ర దేశమందే కలియుగోద్ధరణకై చిత్రావతీ నదీ తీరమందు భగవాన్ శ్రీసత్యసాయి అవతరించినారు. "నా పుట్టుకను నేనే నిశ్చయించుకొన్నాను. కాగల తల్లిని కూడా నిర్ణయించుకొన్నాను. నిర్నిబంధముగా, నిరపేక్షతో ఈ శరీరాన్ని స్వీకరించాను" అని బాబావారే తమ జన్మ రహస్యాన్ని లోకానికి వెల్లడించి యున్నారు. అనగా, శ్రీ సత్యసాయి రూపనామములతో విశ్వాత్మ చైతన్యమే స్వసంకల్ప శక్తిచేత రత్నాకర వంశీయులైన పెదవెంకమరాజు, ఈశ్వరాంబలకు పుత్రరూపంలో సాక్షాత్కరించింది. ఈ పరమాత్ముని చూచి—

ఉ॥ కొందరు రామచంద్రుడని; కొందరు కృష్ణుడటంచు నెంచగా
కొందరు పార్వతీపతిగ; కొందరు ఆ "శివశక్తి"గ నెంత్రు; వా
రందరి భావనా పటిమ కందని శక్తి కతీతుఁడౌను; ఆ
నందము తోడ మీరు నయనంబుల గాంచుడు సాయి తత్త్వమున్.

క్రీ॥శ॥ 1926, నవంబరు 23వ తేది నాడు బ్రహ్మముహూర్త సమయమున శ్రీవారు జన్మించి, "సత్యనారాయణ" అనే పేరుతో పిలువబడుచుండెను. ఆ బాలుడు 'సత్యం' అనే ముద్దు పేరు కలిగియుండి శుక్లపక్ష చంద్రుని వలె దినదిన ప్రవర్ధమానుడై, "బంగా

రమునకు తావి యబ్బినట్లు" సత్యసంధత, సత్ప్రవర్తన మున్నగు సద్గుణములతో గూడి ప్రకాశించుచుండెను. ఈ హేతువు చేత అందరూ సత్యాన్ని "అజన్మ బ్రహ్మజ్ఞాని", అనే పేరుతో పిలిచెడివారు.

సత్యం తన చిన్నతనములోనే చక్కని రచయితగా, మధుర గాయకునిగా, సహజ నాట్యకళావతంసునిగా, కుశాగ్రబుద్ధిగా ప్రసిద్ధి కెక్కాడు. ఆ సమయంలోనే "చెప్పినట్లు చేస్తారా!" అనే నాటకాన్ని స్వయంగా తాను రచించి, అందులో తానే ప్రధాన పాత్రను పోషించి అందరి మన్నన లందుకొన్నాడు. అప్పటి కాతని వయస్సు 12 సం॥లే. మున్ముందు "జగన్నాటకము" నే ఆడింపబోయే "జగన్నాటక సూత్రధారి" యగుట చేత, తానప్పటి నుండియే తన లీలా కౌశల్యమును జగద్విదితం చేయుటకు ప్రారంభించినాడు కాబోలు!

ఒకనాడు ఉరవకొండలో సత్యం హైస్కూల్ నుండి ఇంటికి వచ్చి, తన చేతిలోని, పుస్తకములను విసిరివేసి, "నేను సాయిబాబాను, నా భక్తులు నన్ను పిలుస్తున్నారు, నా కర్తవ్యాన్ని నేను చూసుకోవాలి" అని తన పదునాల్గవ ఏట అవతార ప్రకటన గావించాడు. వెంటనే బయలుదేరి వెళ్ళి అక్కడకు సమీపములో నున్న తోటలోని పెద్ద బండరాతిపై కూర్చొన్నాడు. తన చుట్టూ చేరియున్న జనులకు అవతార ప్రకటనానంతరం మొట్టమొదటి సందేశాన్ని "మానస భజరే గురు చరణం, దుస్తర భవసాగర తరణం" అనే పాట ద్వారా అందించాడు. ఆనాటి నుండి బాబావారి అవతారతత్త్వం జగద్వ్యాప్తిని పొంది, పుట్టపర్తి పరమ పుణ్యక్షేత్రమై నేడు తనరారుచున్నది.

మ॥ అవతారంబులు వచ్చుచుండు ఇలలో — "ఆనాడు- ఈనాడు"; ఈ
అవతారంబులు — "సత్యధర్మ" నిరతిన్ ఆశించియేతెంచు; మా
నవ రూపంబును దాల్చి వత్తురిటులే! "ఆవేళ - ఈవేళ"; మా
ధవ రూపంబున — "సత్యసాయి" తరలెన్; ధాత్రీ స్థలిన్ దైవమై.

"చిత్రావతీ తీర విహారీ...."

"జననీ జన్మ భూమిశ్చ స్వర్గాదపి గరీయసి" అనే ఆదర్శాన్ని లోకానికి నిరూపిస్తూ, బాబావారు తమ జన్మస్థానమైన పుట్టపర్తినే అవతార కార్యక్రమాలకు ప్రధాన కేంద్రంగా ఎన్నుకొన్నారు. తన దర్శనార్థమై వచ్చే భక్తుల సౌకర్యార్థమై బాలసాయి విశాలముగా ఉండినటువంటి కరణం సుబ్బమ్మగారి ఇంట్లో కొంతకాలంపాటు నివాసమేర్పరచుకొన్నారు. కరణం సుబ్బమ్మగారు రెండవ యశోద వలె వాత్సల్యపూరితమైన భక్తితో "సాయికృష్ణుని"కి సేవలు చేసేవారు. రాను-రాను భక్తుల సంఖ్య అధికమగుటచే, 1944వ సంవత్సరంలో 'పాత మందిర' నిర్మాణం జరిగింది.

ఆ కాలంలో బాబావారు ప్రతి నిత్యం సాయంకాలమందు భక్తులతో గూడి చిత్రావతీ నది సైకతస్థలిపై సమావేశమై ఎన్నెన్నో ఆధ్యాత్మిక ప్రబోధనలను సల్పెడివారు. ద్వాపరయుగంలో గోపగోపికాజనమంతా ఆ వేణుగోపాలుని చుట్టూచేరి. ఆ దివ్యమైన వేణు గాన మాధుర్యాన్ని గ్రోలినట్లుగా— చిత్రావతీ ఇసుకతిన్నెలపై భక్తులందరూ సాయిగోపాలుని చెంతచేరి. అతని సందేశామృతాన్ని గ్రోలి సంత సించెడివారు. బాలసాయి ఆ ఇసుక నుండి భక్తులు కోరిన పదార్థములను సృష్టించి ఇచ్చి, ఎన్నోమహిమలను చూపెడివారు. అంతేకాదు. చిత్రావతీనది నానుకొని యున్న గుట్టపై గల కల్పవృక్షం వరకు తనతో పరుగుపందెంలో పాల్గొనమని తన సమవయస్కులందరినీ ఆ బాలసాయి సవాలు చేసి, రెప్పపాటులో ఆ కల్పవృక్షం చేరెడివాడట — ఒకనాడు ఆ కల్పవృక్షం చెంత బాలసాయి చుట్టూ వల యాకారపు జ్యోతిని దర్శించి భక్తులు తన్మయు లైనారట. ఈ అవతారంలో మొదటి 32 సంవత్సరములపాటు లీలలు, మహిమలకు ఎక్కువగా ప్రాధాన్యత ఉంటుందని స్వామి ఒక పర్యాయం అన్నారు కదా! సాయంకాలపు భజన కూడా అక్కడే జరిగేది. బాబావారు తమ కమ్మని కంఠంతో పాటలు పాడి భక్తులకు వీనుల విందొనర్చేవారు. భజనానంతరం ప్రసా దాన్నికూడా తాను స్వయంగా పంచిపెట్టేవారు. ఈ విధంగా, అలనాడు కృష్ణపరమాత్ముడు— "యమునాతీర విహారీ" అని పిలువబడితే, ఈనాడు సత్యసాయి— "చిత్రావతీ తీరవిహారీ" అని కీర్తింపబడి నాడనుట సత్యదూరం కాదు.

## 'ఇంతింతై వటుడింతయై'

రాను-రాను శ్రీవారి అవతారతత్త్వం దేశ విదేశములందు వ్యాప్తినొంది, భక్తుల సంఖ్య పెరిగిపోవుట చేత క్రొత్తమందిర నిర్మా ణం తప్పనిసరియైనది. శ్రీవారు తమ 25వ జన్మదినోత్సవమునాడు ఈ నూతన మందిర ప్రవేశం గావించినారు. అదే ఈనాటి ప్రశాంతి నిలయమందిరం. క్రమక్రమంగా బొంబాయిలో "ధర్మక్షేత్ర" మందిరం, హైదరాబాదులో "శివం" మందిరం, మద్రాసులో "సుందరం" మందిరాలు నిర్మింపబడినవి. అంతేగాక, దేశ విదేశములందు అనేక చోట్ల సత్యసాయి సేవా సంస్థలు నెలకొల్పబడినవి. ఈ సేవా సంస్థల న్నింటికీ తగిన ఆదేశ, సందేశాలను అందజేసే నిమిత్తమై "అఖిల ప్రపంచ సత్యసాయి సేవా సంస్థల సమావేశములు" నిర్వహింపబడవలె నని నిర్ణయించబడినది. బొంబాయి యందు 1968లో జరిగిన ప్రప్రథమ సమ్మేళనానికి 40 దేశాల నుండి 5000 మంది ప్రతినిధులు హాజరుకాగా, 1990లో ప్రశాంతినిలయంలో జరుపబడిన 5వ ప్రపంచ సమ్మేళనానికి మన దేశం నుండి, 98 ఇతరదేశాల నుండి సుమారు 50,000 వేలమంది సేవాకార్య కర్తలు పాల్గొన్నారు. ఈ విషయాన్ని పరిశీలిస్తే, శ్రీవారి అవతారతత్త్వం ఎంత వేగంగా విశ్వ వ్యాప్తి నొందుతున్నదో అవగతమౌతుంది.

ఈనాడు అన్ని మతస్థులవారు తమ తమ పర్వదినాలను శ్రీవారి సమక్షంలో ఆనందంగా జరుపుకొంటున్నారు. వివిధ దేశస్థులతో, వివిధ మతస్థులతోగూడి నేడు ప్రశాంతినిలయం కళ కళలాడుతున్నది. సర్వజన సామరస్య వాతా

వరణంతో. వివిధ కళాత్మక నిర్మాణాలతో— "కలియుగ వైకుంఠం"గా విరాజిల్లుతున్న ఈ ప్రశాంతినిలయములో యుగావతారుడగు శ్రీ సత్యసాయి సృష్టిస్తున్న అత్యద్భుతాలను ఒకసారి పరిశీలించెదము గాక!

## సృష్టికి ప్రతిసృష్టి

1975వ సంవత్సరం నవంబరు నెలలో ప్రశాంతినిలయ మందిరానికి సమీపంలోనే సుమారు 55 అడుగుల ఎత్తుగల "సర్వధర్మ స్థూపాన్ని" నిర్మింపజేసారు. "మతములన్ని జేరి మంచినే బోధించు, తెలిసి మెలగవలయు తెలివితోడ, మతులు మంచివైన— మతమేది చెడ్డది" అంటారు బాబా. ఈ స్థూపము పై ప్రపంచంలోని ప్రధాన మతముల చిహ్నములు చిత్రీకరింపబడి, అవి అందిస్తున్న ఉపదేశ ముల అంతరార్థములు లఖింపబడియున్నవి.

ఆధునిక విద్యలతోపాటు, అధ్యాత్మిక విద్యను కూడా అందించి విద్యార్థులను భావి భారతోద్ధారకులుగా తీర్చిదిద్దాలనే సంకల్పంతో శ్రీవారు మొట్టమొదట 1971వ సం॥లో అనంత పురం బాలికల కళాశాలను ప్రారంభించారు. తదుపరి 1978వ సం॥ బెంగుళూరులో బాలుర కళాశాల నెలకొన్నది. తుదకు 1981వ సంవత్సరంలో శ్రీ సత్యసాయి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హైయర్ లెర్నింగ్ (డీమ్డ్ యూనివర్సిటీ) రూపుదాల్చినది. బాబావారే దీనికి ఛాన్సలర్. 1982వ సంవత్సరంలో కొండపై నిర్మింపబడిన కార్యనిర్వాహక భవనాన్ని ప్రారంభిస్తూ— "అనంతపురం కళాశాల 'గంగానది' గను, బృందావనం కళాశాల 'యమునానది' గను, పుట్టపర్తి కళాశాల 'సరస్వతీనది' గను, రూపొంది, మనమీనాడు 'త్రివేణిసంగమం' ను చూడగలుగుతున్నాము" అని తెలియ జేసారు. ఈ యూనివర్సిటీకి అనుబంధంగా ఒక కంప్యూటర్ సెంటర్ కూడా నెలకొల్ప బడింది. సత్యసాయి విద్యాసంస్థలలో— 'లైబ్రరీ' మొదలుకొని 'లాబొరేటరీ' వరకు సమస్త విద్యా సౌకర్యములు ఉచితముగా విద్యార్థుల కందించబడుచున్నవి.

సత్యసాయి యూనివర్సిటీ భవనము మాత్రమేగాక శ్రీ సత్యసాయి హైయర్ సెకండరీ స్కూల్, ప్రైమరీ స్కూల్, అధునాతన మైన "నక్షత్రశాల" మున్నగు భవంతులతో గూడి పుట్టపర్తి యందలి "విద్యాగిరి" ప్రాంతము చూపరులకు ఆనందాశ్చర్యములు చేకూర్చుచుండును. విద్యాగిరి నానుకొని బ్రహ్మాండమైన "హిల్ వ్యూ" స్టేడియం నిర్మించబడింది. ఈ స్టేడియం ప్రక్కనే గల కొండపై వివిధ మతప్రవక్తల ఎత్తైన ప్రతిమలు నిర్మింపబడ్డవి. వీటన్నింటికన్నా ఎత్తైన 65 అడుగుల ఆంజనేయ విగ్రహం యాత్రికులను ప్రత్యేకంగా ఆకర్షిస్తున్నది.

ఇటీవలనే యూనివర్సిటీ కార్యనిర్వాహక భవనమునకు సమీపమున "సనాతన సంస్కృతి" అనే పేరుతో మూడంతస్థుల ప్రదర్శనశాల (మ్యూజియం) నెలకొల్పబడినది. ప్రాచీన భారతీయ సంస్కృతి ప్రభావము క్షీణిస్తున్న ఈ తరుణంలో బాబావారు తమ ప్రబోధల ద్వారానేగాక, ఇట్టి ప్రదర్శనశాలల ద్వారా కూడా మన సనాతన సంస్కృతి ప్రాశస్త్యాన్ని తెలియజేస్తున్నారు. నవనాగరికతా వ్యామోహ పరవశులైన వారికి ఈ మ్యూజియం

కనువిప్పు కలిగించక మానదు. ఈ మ్యూజియంలో ప్రదర్శింపబడుతున్న విషయాలను చూసి తరించవలసినదేగాని, వర్ణింపనలవి కాదు.

సుదూర ప్రాంతాల నుండి భగవానుని సందర్శనార్థం వచ్చే యాత్రికుల సౌకర్యార్థమై పుట్టపర్తికి 5 కి.మీ. దూరంలో "శ్రీ సత్యసాయి ఎయిర్ పోర్ట్" అనబడే విమానాశ్రయం ఈ మధ్యనే ప్రారంభించబడింది.

దీనికి అతి సమీపములోనే "శ్రీ సత్యసాయి సూపర్ స్పెషాలిటీస్ హాస్పిటల్" సర్వాంగ సుందరంగా సంసిద్ధ మౌతున్నది. ఈ హాస్పిటల్ శంఖుస్థాపన బాబావారు కేవలం ఒక సంవత్సరం క్రిందటే చేసియున్నారు. అనేక కోట్ల రూపాయల వ్యయంతో నిర్మింపబడిన ఈ అత్యంతాధునాతనమైన వైద్యశాల సర్వజనుల పాలిటి "కల్పతరువు" వంటిది అనుటలో అతిశయోక్తి లేదు. దీనియందు గుండె, ఊపిరితిత్తులు, మూత్రపిండములు మొదలగు వాటికి సంబంధించిన శస్త్రచికిత్సలన్నీ ఉచితంగా జరుపబడతాయి. నేటి యావత్ప్రపంచము నందే ఒక అధునాతనమైన వైద్యశాల అత్యంత వ్యయంతో కూడిన వైద్య సౌకర్యాలను ఉచితంగా, సేవాదృక్పథంతో జనులకు అందించుట అనే విషయాన్ని మనం ఇంతవరకు వినియుండలేదు. "సాయి చేసే సర్వకార్యములు స్వార్థరహితమైనవి; సమాజ కళ్యాణము నందించేవి. సాయిమార్గం సత్య మార్గం, ధర్మమార్గం." అని శ్రీవారే చాటియున్నారు.

మానవ శ్రేయస్సుకై నిత్యజీవితంలో సత్యసాయి నిరంతరం అనేక నిర్మాణాత్మక కార్యక్రమాలలో నిమగ్నులై ఉంటారేగాని, తనకు ఏకొద్ది కాలమైనా విశ్రమించుటనేదే లేదంటారు బాబా. "నేనెన్నడు విశ్రమించను, అలసట చెందను. శ్రమిస్తే కదా! విశ్రమించేది. విశ్వవ్యాప్తంగా ఎడతెగని పనులను తేలికగా జరుపుతూ నిరంతరం ఆనందంగా ఉంటాను" అని శ్రీవారు ఒక పర్యాయం తెలిపియే యున్నారు. ఇట్టి దైవశక్తి ఊహకందనిది కదా!

ఒకనాటి కుగ్రామమైన పుట్టపర్తి యొక్క నేటి వైభవాన్ని తిలకిస్తే, "ఇది కలయో! వైష్ణవ మాయయో!" అనిపించక మానదు. అయితే ఇది కలకాదు, వైష్ణవమాయ అంతకన్నా కాదు. "నా జీవితమే నా సందేశం" అని నినదిస్తూ, లీలామానుష వేషధారియైన సత్యసాయి సర్వమానవ శ్రేయస్సుకై చేస్తున్న ఈ సృష్టికి ఒక అనిర్వచనీయమైన ప్రతి సృష్టియే.

## ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి

ఉ॥ ఎప్పుడు ధర్మహానియగు — నెప్పుడధర్మము వృద్ధి గాంచునో
అప్పుడ—"నేను పుట్టుదు సుమా!" యని కృష్ణుడు పల్కినట్లుగా
ఇప్పుడు—"సత్యసాయి పరమేశుడు"— పుట్టెను పర్తిలోన; తా
నిప్పుడమిన్ "సుధర్మము"ను- నిల్పుచునుండె ప్రశాంతపద్ధతిన్

"త్రేతాయుగ ద్వాపరయుగములలో దుష్టజనుల సంఖ్య పరిమితంగా ఉండుట చేత రామకృష్ణాద్యవతారములు ఆయుధముల చేతబూని ధర్మ సంస్థాపన గావిస్తే, ఈ కలి యుగంలో సర్వత్రా దుష్టజనులు నిండియుం డుట చేత ఈ సత్యసాయి ప్రేమావతారుడై తన దివ్య ప్రబోధల చేత జనులందరిలో మానసిక పరివర్తన గావిస్తున్నాడు" అని బాబావారు పేర్కొన్నారు. దేశ కాలపరిస్థితుల ప్రభావమును పురస్కరించుకొనియే కదా! అవతారములు సంచరిస్తుంటాయి. ఈనాడు సత్యసాయి అవతారం గావిస్తున్న ధర్మ సంస్థాపనలో చమత్కారం, సంస్కారం, పరోప కారం, సాక్షాత్కారం అనే నాలుగు సోపాన ములున్నవని శ్రీవారే తెలిపియున్నారు.

ఒక పర్యాయం బాబావారు తమ దివ్యోపన్యా సంలో, "చమత్కారం (మిరకిల్) అనేది ఆక ర్షించుట కొఱకే. రామకృష్ణాది అవతారములు కూడా జనులను ఆకర్షించేవారు. ఆకర్షణ అనేది దైవత్వానికి ప్రధానమైన గుణం. అయితే, ఈ ఆకర్షించేది దేనికోసం? వారిని సంస్కరింపజేయుటకే సంస్కారము యొక్క లక్ష్యమేమి? వారిని పరోపకారులుగా తయారు చేయుటయే; ఈ పరోపకార దీక్షతో వారు స్వార్థాన్ని మరచి, అందరి యందున్న ఏక త్వాన్ని గుర్తించి, సాక్షాత్కారం పొందుటయే. అయితే, ఈ నాలుగు సోపానములందు అంత ర్వాహినిగా ప్రవహిస్తున్నది ప్రేమతత్త్వమే. కనుక, నా ప్రేమయే ఒక గొప్ప మిరకిల్" అన్నారు. ఇట్టి మహత్తరమైన ప్రేమశక్తి చేత ఆకర్షింపబడి, లక్షలాది జనులు భగవానుని చెంతచేరి ఆయన దివ్యప్రబోధల చేత ప్రభా వితులౌతున్నారు. ఆనాడు కురుక్షేత్రంలో కర్త వ్యాన్ని గుర్తించుటకు ధర్మ పరాయణుడైన అర్జునునికే భగవద్గీత అవసరమైతే, ఈనాడు అనేక అరాచకాలతో కూడిన ప్రపంచమనే 'సంగ్రామ క్షేత్రం'లో సత్య ధర్మాలు లేనట్టి మానవులకు తమ కర్తవ్యాన్ని గుర్తించుటకై 'సాయిగీత' అవశ్యకత ఎంతేని ఉన్నది కదా! సనాతన ధర్మ పునరుద్ధరణతో నవయుగానికి నాందిపలుకుటకై ఏతెంచిన ఈ సత్యసాయి విద్యా రంగానికి, సేవా రంగానికి అత్యంత ప్రాధాన్యతనిస్తున్నారు.

"విద్య ఉద్యోగాలకను వెఱ్ఱి వీడి, సమాజ శ్రేయస్సుకై పాటుపడండి. మీ ఫుడ్ (ఆహారం), బ్లడ్ (రక్తం), హెడ్ (తల)— ఇవన్నీ మీ తల్లిదండ్రులు మీకిచ్చిన బహుమ తులే. కాబట్టి, మొట్టమొదట తల్లిదండ్రుల యెడల కృతజ్ఞతాభావాన్ని కలిగియుండండి. పరదేశ వ్యామోహం విడనాడి త్యాగభూమి, యోగభూమి, కర్మభూమియైన ఈ భరత భూమి యొక్క ప్రాచీన సంస్కృతి పునరుద్ధ రణకై మీ జీవితాన్ని అంకితం చేయండి" అని శ్రీవారు విద్యార్థులకు పిలుపునిస్తున్నారు— "విద్యార్థులు విషయార్థులు కారాద"ంటారు బాబా. యావత్ప్రపంచపు భవిష్యత్తు యువతీ యువకుల చేతిలో ఉంటున్నది. కావున, శ్రీవారు అనేక అత్యున్నత విద్యాసంస్థలను నెలకొల్పి, వాటి యందు ఆధునిక విద్య, క్రీడలు మున్నగువాటితో పాటు మానవతా విలువలకు కూడా ప్రాధాన్యత నిచ్చి, విద్యా ర్థులలో శారీరక, మానసిక, ఆధ్యాత్మిక వికా సాన్ని కలుగజేస్తున్నారు. హృదయాలను ఉత్తేజపరచే, భావాలను విశాలపరచే, ఆలో

చనా సరళిని అభివృద్ధిపరచే ఇట్టి విద్యావిధానంలో శిక్షణ పొందిన విద్యార్థులు 'ఆధ్యాత్మిక విప్లవ యోధులు'గా రూపొంది, సత్యసాయి గావిస్తున్న ధర్మ సంస్థాపనలో ప్రధాన పాత్ర వహించగలరనుటలో సందేహం లేదు.

శ్రీవారు తన చెంతచేరిన వారిలో మానసిక పరివర్తన కల్గించి, వారిని పరోపకారులుగా తీర్చిదిద్దుతున్నారు. ఈ సాయిభక్తులు దేశ విదేశాలలో పలుచోట్ల సత్యసాయి సేవాసంస్థల నేర్పరచి, స్వచ్ఛంద సేవా కార్యక్రమాలను కొనసాగిస్తూ, సమాజ శ్రేయస్సుకై కృషి సల్పుతున్నారు. సత్యసాయి సేవాసంస్థల మూడవ ప్రపంచ సమ్మేళనంలో శ్రీవారు మాట్లాడుతూ, "ఉన్నది ఒకే మతం— అది ప్రేమమతం. అందరికీ ఒకే దైవం— అతడు సర్వాంతర్యామి. అందరిదీ ఒకేకులం— అదే మానవత్వం. కాబట్టి, లౌకిక సంబంధమైన సంకుచిత స్వభావాలను విడనాడి, సేవలలో పాల్గొనండి" అని ఉద్బోధించారు. భగవానుని ఇట్టి సందేశానుసారం సత్యసాయి సంస్థలు కుల, మత, జాతి, వర్ణ విచక్షణకు తావీయకుండా, ప్రపంచానికంతటికీ ఆదర్శప్రాయమై నిలిచినాయి.

ఈ సేవాసంస్థలు బాలవికాస్, భజన మండలి మున్నగు అనుబంధ శాఖలతో కూడి ఉంటున్నాయి. "మొక్కై వంగనిది మ్రానై వంగదు" కదా! కాబట్టి, సత్యసాయి సేవా సంస్థలు చిన్నపిల్లల అభ్యుదయానికి ప్రత్యేక శ్రద్ధ చూపిస్తున్నాయి. బాలవికాస్ తరగతులను నిర్వహించి, వారికి మానవతా విలువల ఆవశ్యకతను బోధించి, వారిలో మానసిక చైతన్యం తీసికొని వస్తున్నాయి.

"సేవకు మించిన యోగం లేదు సేవలు చేయడానికి రిటైర్మెంట్ అనేదే లేదు కడపటి శ్వాసను కూడా సేవలోనే వదలాలి సత్యసాయి వంటి ప్రభువు, సాయిభక్తుల వంటి సేవకులు ఉన్నప్పుడు ఎంతటి కార్యాన్నైనా సాధించవచ్చు" అని శ్రీవారు తమ 60వ జన్మదినోత్సవ సందేశంలో పేర్కొన్నారు. భగవానుడు అందిస్తున్న ఇట్టి స్ఫూర్తితో సత్యసాయి సంస్థలు వివిధ ప్రదేశాలలో తమకు అందుబాటులో నున్న గ్రామాలను దత్తత తీసికొని వాటి అభివృద్ధికై పాటుపడుతున్నవి. "గ్రామ సేవయన్న రామసేవయే సుమ్మీ!" అంటారు బాబా. వికలాంగులకు, రోగులకు వైద్య సహాయాన్ని అందించుట, నీటి సదుపాయాలను సమకూర్చుట, పేద విద్యార్థుల విద్యాభ్యాసానికి తోడ్పడుట, సత్సంగములను నిర్వహించుట, అన్నదానం, వస్త్రదానం— మున్నగు సేవాకార్యక్రమములలో చిన్న-పెద్ద అనే తారతమ్యం లేకుండా ఐకమత్యంగా పనిచేస్తూ— "మానవసోదరత్వము — దైవపితృత్వము" అనే శ్రీవారి ప్రబోధను చాటుతున్నారు.

"సేవలలో అహంకార, మమకారములు అణగిపోయి, ఐకమత్యము అభివృద్ధి చెందుతుంది. ఐక్యత ఉన్నచోటనే పవిత్రత గోచరిస్తుంది. పవిత్రత ఉన్నచోటనే దైవత్వం సాక్షాత్కరిస్తుంది" అంటారు బాబా. ఇది ముమ్మాటికి నిజం. శ్రీ సత్యసాయి ఈ విధంగా సమాజంలో సృష్టిస్తున్న చైతన్యం ద్వారా సాయి అవతారతత్త్వం, సాయి ప్రబోధలు— ప్రపంచం నలుమూలలా ప్రాకిపోతున్నాయి. "సాయి నామం ఇంటింటా కాదు—ఇంచ్ ఇంచ్ వ్యాపించిపోతుంది" అని ఒక పర్యా

యము శ్రీవారు సెలవిచ్చిన మాట అక్షరాలా నిజమౌతోంది. క్రితం సంవత్సరం జరిగిన ప్రపంచ సమ్మేళనానికి 98 దేశాలకు చెందిన ప్రతినిధులు రావడమే ఇందుకు నిదర్శనం.

ఈ విధంగా, ఇంత అనతి కాలంలోనే ప్రపంచ వ్యాప్తంగా లక్షలాది ప్రజలు సత్యసాయి విశ్వచ్ఛత్రాధిపత్యమును గుర్తించి, దైవప్రీతిని — పాపభీతిని — సంఘనీతిని కల్గియుండి, సాయి మాటను, సాయి బాటను అనుసరిస్తున్నారంటే — ఇదే సాయి యుగారంభానికి మహోదయం.

"నేనెవ్వరు ?"

"సత్యసాయి అనగా ఈ ఐదడుగుల దేహమని కాదు. సత్యసాయి అంటే— సత్య సాయి; అనగా 'సత్యముపై పవళించినవాడ'ని అర్థం. కనుక, సత్యసాయి సత్యస్వరూపమే- ధర్మస్వరూపమే నా శక్తి సామర్థ్యాలను ఎవ్వరూ అర్థం చేసికొనలేరు. ఆకాశమును భూమిగ, భూమిని ఆకాశంగా మార్చగలను. కాని, అది దైవత్వానికి నిజమైన నిదర్శనము కాదు. నా ప్రేమయే దీనికి నిదర్శనం. నేను దూషణ-భూషణలకు క్రుంగను, పొంగను. ఈ దూషణ-భూషణలు నన్ను యుగ యుగములనుండి వెంటాడుతున్నవే. నేను వచ్చిన కార్యక్రమం— 'ధర్మసంస్థాపన', నా సంకల్పం తప్పక సిద్ధిస్తుంది" అని భగవానుడు తమ దివ్యోపన్యాసాలలో తెలియజేసారు.

శ్రీవారు తమ 20 వ ఏట అన్నగారైన శ్రీ శేషమరాజుకి వ్రాసిన ఉత్తరంలో "నేనే దేహానికి కట్టుబడలేదు. ఏ నామమునకు కట్టుబడను. నాది, నీది అనే భేదం నాకులేదు. ఏ పేరుతో పిలిచినా పలుకుతాను" అని పేర్కొన్నారు. అంతేగాక, శ్రీవారు తమ 1990 దసరా సందేశంలో "ఆనాడు షిర్డీసాయిగా ఏతెంచినది దివ్యత్వాన్ని తెలుపుట కొరకు, ఈనాడు సత్యసాయిగా అవతరించినది దివ్యత్వాన్ని అందించే కొరకు, రాబోయే ప్రేమసాయి అవతారం దివ్యత్వాన్ని బోధించే కొరకు" అని తెలియజేసారు. ఇట్టి అవతార పురుషునికి సమకాలీనుల మగుట అనేది ఎన్నెన్ని జన్మల సుకృత తపః ఫలమో కదా!

చ॥ మతములు వేరువేరయిన—"మాధవుఁడొక్కఁడె" యంచు నెల్లరుఁ
మతితలపోయనేడు— ఒక మార్గము చూపెను సత్యసాయి; ఈ
క్షితిపంబు— "పుట్టపర్తి" ఒక క్షేత్రమటంచని — అన్ని వర్ణముల్
చతురత గల్గి కొలుచుఁక — చక్కని, చిక్కని పర్తివాసునిఁ!

—"కవికుమార్", ప్రశాంతినిలయం.



# సేవా యోగం

ప్రేమస్వరూపులారా !

మానవత్వాన్ని గుర్తించిన మానవునికి ఈ సేవలు ఏమంత మహత్తరమైనవి కావు. మానవుడు కర్మ చేత బంధింపబడినవాడు, మానవ శరీరము పరోపకారార్థమై వచ్చినది- ఇట్టి సత్యాన్ని వ్యక్తులు గుర్తించుకోవాలి.

మొట్టమొదట మనం ఎవరికి సేవలు చేస్తున్నాము? అని విచారించాలి. ఈనాడు మానవుడు చేసే ప్రతీ కర్మ ఫలాపేక్షతోకూడి ఉంటున్నది. ఫలాపేక్ష సహితంగా చేసేవి బంధానికి, ఫలాపేక్ష రహితంగా చేసేవి బంధవిముక్తికి కారణాలు-అని కర్మలు రెండు తెగలుగా ఉంటున్నవి. అయితే, సత్యసాయి సంస్థలకు చెందిన వ్యక్తులు స్వార్థరహితంగా, ప్రేమపూర్వకంగా, ఎంతో ఉత్సాహంతో సేవలు చేస్తూవచ్చారు. కాని, ఈ సేవలు ఎవరి కోసం చేసాము? బంధాపేక్షతోగాని, బంధవిమోచనాపేక్షతోగాని చేసినప్పటికిని మనకు మనమే చేసుకున్నాముగాని, ఈ సేవలు పరులకు చేసినవి కావు. ఫలాపేక్ష రహితంగా చేసిన కర్మలు మననే బంధవిముక్తుల గావిస్తాయి, ఫలాపేక్ష సహితంగా చేసిన కర్మలు మనకే బంధాన్ని చేకూరుస్తాయి. అనగా బంధము మనకే, బంధవిముక్తి మనకే. కనుక మనం చేసే కర్మలు మనకోసమేగాని, పరుల కోసం కాదు—అనే సత్యాన్ని గుర్తించి, వర్తించుట వ్యక్తిత్వం యొక్క సహజ కర్తవ్యం.

## అంతరాత్మను తృప్తిపరచుకో

పశుపక్ష్య మృగాదులు కూడా మానవుని వలె కర్మలనాచరిస్తున్నాయి. కనుక, కర్మలనాచరించుట ప్రధానం కాదు. పవిత్రమైన మానవత్వం ప్రాప్తించినందుకు, ఈ దేహంలో ఉండిన సర్వాంగములను సార్థకం గావించుకొనే నిమిత్తమై మనము సేవలలో పాల్గొని, తద్వారా మానవత్వాన్ని సార్థకం చేసుకోవాలి- అప్పుడే "సేవ" అనే పదానికి సరియైన అర్థం చేకూరుతుంది. ఏదో సత్యసాయి సేవాసంస్థల నిమిత్తమైగాని లేక పేరుప్రతిష్ఠల నిమిత్తమైగాని లేక ప్రభుత్వము నిమిత్తమైగాని—మనం ఈ సేవలలో పాల్గొన్నామని భావించరాదు. పరుల తృప్తికోసం కాదు, మన తృప్తికోసం మనం చెయ్యాలి ఇతరులు మెచ్చుకొనే పనులు చేయుట కంటే, శివుడు మెచ్చుకొనే పనులు చేయాలి. అవే నిజమైన సేవలు. ఆ శివుడు ఎక్కడ ఉన్నాడు? మానవుడు తన అంతరాత్మను తృప్తిపరచిన యెడల—అదే శివుడు మెచ్చు పని. ప్రభుత్వము ఎన్నైనా చెప్పవచ్చును, ప్రజలు

ఎంతైనా వర్ణించవచ్చును. కాని, మనకు ఈ వర్ణనలు అక్కరలేదు. తాను చేసిన పని మంచిదా? చెడ్డదా? అనే విషయంలో తనకు తాను "ఇది సరియైనది" అని అనుకుంటే— అదే ఆత్మసాక్షి. కనుక, మన అంతరాత్మను తృప్తిపరచాలి. దానికి మించిన తృప్తి మరొకటి లేదు.

మీరు ఈ సేవలను చాలా ఉత్సాహంగా, హృదయపూర్వకంగా చేసారు. మీ ఆత్మతృప్తిగా చేసారు. అందరి ఆప్యాయతను, గౌరవ మర్యాదలను అందుకున్నారు. అయితే—"నేను ఈ సేవలను ఏవిధంగా చేసాను? ఆనందంగా చేసానా? ఆడంబరంగా చేసానా? ఆత్మార్పణంగా చేసానా?" అనే విషయంలో మీ ఆత్మను తృప్తిపరచాలి.

ఐకమత్యాన్ని పెంచుకొనే నిమిత్తం మనం సేవలు చేయాలి. మీలో ఒక్కొక్కరు ఒక్కొక్క గ్రామానికి చెందినవారు. కాని, సేవలలో పాల్గొనేటప్పుడు అందరూ కలసి పని చేయుట చేత అన్నదమ్ములవలె, అక్కచెల్లెళ్ళ వలె ఎంతో ఏకత్వాన్ని అనుభవిస్తూ వచ్చారు. మీతో సేవలు చేయించుకున్నవారు కూడ "అమ్మా! మీరు మాకెంతో సేవ చేసారు" అని ధన్యవాదాలు తెల్పుకున్నారు. ఇట్టి ఏకత్వం కొనమే సేవలు ప్రారంభించబడినవి. మానవుడు ఒంటరిగానే పుట్టాడు. కాని, తనకు తెలివి తేటలు అభివృద్ధి అయ్యే కొలది తల్లిదండ్రుల, తోబుట్టువుల సంబంధమేర్పడుతుంది. తనకు వివాహమైన తరువాత భార్యతోపాటు అత్తమామల, బావమరుదుల సంబంధం ఏర్పడుతుంది. క్రమక్రమంగా కొడుకులు, కొడుకుల ద్వారా కోడళ్ళు- ఈ విధంగా సంబంధములు ఒకదానివెంట మరొకటి పెరుగుతూ వస్తాయి. కనుక. మానవజన్మలోనే క్షణక్షణమూ ఈ ఏకత్వమనేది సాక్షాత్కరిస్తోంది. భిన్నత్వములోని ఏకత్వాన్ని పాటించుటయే సేవల అంతరార్థం.

## రాక్షసత్వం — దైవత్వం

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే॥"

అని శ్రీకృష్ణుడు భగవద్గీత యందు తెలిపియున్నాడు. అనగా సద్గుణములు కలిగిన వారిని రక్షించి, దుర్గుణములు కలిగిన వారిని శిక్షించి ధర్మ స్థాపన చేయుట. అని భావిస్తున్నాము. ఇది సరియైనది కాదు. "రాక్షసత్వాన్ని రూపుమాపి, దైవత్వాన్ని అభివృద్ధి పరచి, దివ్యత్వమైన ధర్మాన్ని జగత్తు యందు స్థాపించుట" యే దీనికి సరియైన అర్థము. ఇక్కడ రాక్షసత్వం అనగా ఏమిటి? దైవత్వం అనగా ఏమిటి? అని మనం విచారించాలి. "పరిత్రాణాయ సాధూనాం" అనే పదములో "సాధుత్వం" అనగా నిర్మలంగా, నిస్స్వార్థంగా, నిరహంకారంగా ఉండిన మానవ స్వభావము అని అర్థం. "వినాశాయ చ దుష్కృతాం" ఇక్కడ దుష్కృతములనగా దుర్మార్గులైన, దుష్టులైన మానవులు కాదు. రాగ ద్వేషాలు, అసూయ, అహంకారము—ఇవే "దుష్టులు". ఈ "దుష్టుల" హతమార్చి నిర్మల, నిస్స్వార్థ, నిరహంకారములను రక్షించుటయే—ధర్మ సంస్థాపన. ధర్మమనగా ఏమిటి? "రామో విగ్రహవాన్ ధర్మః" భగవంతుడే ధర్మస్వరూపుడు.

## రావణతత్త్వం — రామతత్త్వం

ఈనాడు మానవత్వంలో రెండు తత్త్వములు ప్రధానంగా గోచరిస్తున్నాయి. ఒకటి రావణతత్త్వం, రెండవది రామతత్త్వం. రావణతత్త్వం— రాగ ద్వేషాహంకారములతో కూడినది. రామతత్త్వం— నిర్మల, నిస్స్వార్థ, నిరహంకారములతో కూడినది. రాముడు లోకకల్యాణం నిమిత్తమై తనకున్న సర్వభోగ భాగ్యములను త్యజించి కారడవులలో ప్రవేశించి, రాగ ద్వేషాహంకారములతో కూడిన రాక్షసులను సంహరించాడు. కాని ఈనాటి రామభక్తులు రాముడు

త్యజించిన భోగ భాగ్యములనే ఆశిస్తూ తద్వారా ఈ రాగ ద్వేషాహంకారములను మరింత అభివృద్ధి పరచు కుంటున్నారు. ఇది రామ భక్తి యొక్క తత్త్వం కాదు. "గ్రామసేవ యన్న రామ సేవయే సుమ్మీ!" అని పూర్వం చెప్పాను. గ్రామసేవ చేస్తున్నామంటే, దానిని రామ సేవగానే భావించాలి. రామ సేవ అనగా ఏమిటి? రాముడు దేనిని త్యజించాడో, దానిని మనం కూడా త్యజించాలి. రాముడు భోగభాగ్యాలను త్యజించి, నారవస్త్రాలను ధరించి, కారడవులలో ప్రవేశించి రాక్షస సంహారం గావించాడు. మనం కూడా భయంకరమైన జీవితారణ్యంలోనికి ప్రవేశిస్తున్నాము. మన వెంట "హృదయ రాముని" తీసికొని వెళ్ళుచున్నాము. ఈ "రాముడు" లౌకికమైన సుఖ సంతోష, భోగభాగ్యాలను త్యజించాలి. అప్పుడే ఈ జీవితారణ్యంలో సంచరించే "రాక్షసగుణముల"ను విడనాడవచ్చును.

మన రాగ, ద్వేష, అహంకారములను నిర్మూలం గావించుకొనుటకై సేవలు చేయాలి. మనం సేవాభావముతో నడుము వంచి పనిచేసినప్పుడు "నేను ఇంతటి గొప్పవాడను" అనే అహంకారం మొట్ట మొదట అణగిపోతుంది అహంకారాన్ని నిర్మూలం చేసికొన్నప్పుడు మనలో నిస్వార్థం ఆవిర్భవిస్తుంది. నిస్వార్థం వలన నిర్మలత్వం చేకూరుతుంది. మనం బంధవిమోచన గావించుకొనే నిమిత్తం నిస్వార్థంగా. నిష్కల్మషంగా కర్మలనాచరించాలి. అప్పుడే ధన్యుల మౌతాము.

## ప్రాకృతమైన భేదభావాలు పాటించకండి

బ్రాహ్మణధర్మం, క్షత్రియధర్మం, వైశ్య ధర్మం — ఇవన్నీ అనిత్యమైన దేహాలకు సంబంధించినవి. దేహ సంబంధమైన ఈ నిబంధనలకు, ఆధ్యాత్మికానికి ఎట్టి సంబంధము లేదు. దేహాన్ని బట్టి పురుషుడని, స్త్రీయని, బ్రాహ్మణుడని, వైశ్యుడని—భావిస్తున్నాము. కాని, దైవత్వానికట్టి భేదము లేదు. గాలిదేకులం? బ్రాహ్మణ, క్షత్రియ, హరిజన వర్గాలకు చెందిన వారందరు ఈ గాలిని సమంగా పీల్చుకొంటున్నారు. గాలికెట్టి పరిమితి లేదు. అదేవిధంగా అగ్ని, జలము కూడా కుల మతాలకతీతమైనవి. అగ్ని సర్వమునూ భస్మము గావించి ఏకత్వాన్ని నిరూపిస్తుంది. కనుక, ఈ పంచభూతములన్నీ భగవదంశములే, ఇవి ప్రతి మానవుని యందు ఉన్నాయి. అంతేకాకుండా ప్రతి మానవునికి ఆకలి, నిద్ర మరియు జననమరణాదులు సమంగా ఉంటున్నాయి. ఇట్టి ఏకత్వాన్ని మనం గుర్తించాలి. "ప్రతి మానవుని శరీరం ఒక రథము వంటిది, ఆత్మయే రథికుడు" అని కఠోపనిషత్తు బోధిస్తున్నది. ప్రతి మానవునికి శరీరం ఉన్నది. ప్రతి మానవుని యందు ఆత్మ ఉంటున్నది. ప్రతి మానవుని శరీరం పంచభూతముల చేరికయే. మనకు ఇంతకంటే గొప్ప సమత్వం ఏమి కావాలి? కాబట్టి ప్రాకృతమైన భేదభావాలను మనం పాటించరాదు.

## పాపాలు చెయ్యవద్దు — పాపపరిహారాలు వెదకవద్దు

ఈనాడు మనం వేద శాస్త్రేతిహాస పురాణములను చదువుతున్నామే గాని, ఆచరించుట లేదు. భాగవతమో లేక భగవద్గీతనో పారాయణం చేస్తున్నాం. ఏమిటీ పారాయణం? ఈ గ్రంథాలను పారాయణ చేయమని ఎవ్వరూ చెప్పలేదు, ఆచరించమని చెప్పినారు. బైబిల్, ఖురాను, భగవద్గీత మున్నగు పవిత్ర గ్రంథాలను కేవలం తెలిసికొని బోధించినంత మాత్రమున ఉపయోగం లేదు. వాటిలోని పవిత్రమైన విషయాలను ఆచరించాలి. కొంతమంది భగవద్గీతలో 700 శ్లోకాలను కంఠస్థం చేసామని గొప్పగా చెప్పుకుంటారు. దీని వలన ప్రయోజనమేమి? కలిగేది కంఠానికి నొప్పి మాత్రమే. తెలుసుకొన్న విషయాలనెంత వరకు ఆచరణలో పెట్టుతున్నామనేది ముఖ్యం. ఈ పవిత్రమైన కర్మభూమిలో ప్రతి మానవుడు కూడా పవిత్రుడే. కాని, ఆ పవిత్రతను సరిగా నిరూపించే

వాడు లేకపోవుట చేత అందరూ అజ్ఞానంలో పడిపో తున్నారు. జపాలు, ధ్యానాలు చేస్తే పాప పరిహార మౌతుందని భ్రమిస్తున్నారు. ఈ విధంగా పాపపరి హారాల కోసం చూస్తున్నామే గాని, పాపాలు చేయ కుండా ఉండటానికి ఏమాత్రం ప్రయత్నించుట లేదు. జన్మజన్మల యొక్క "పాపఫలం" మానవుని దుష్కార్యాలలోనికి నెట్టివేస్తుంది. దీనిని పరిహారం గావించుకొనే నిమిత్తమై, ఈ పవిత్రమైన సేవలలో పాల్గొనాలి.

ఇతరుల హృదయాలను సంతృప్తి పరిస్తే, వారి సంతృప్తి మన పాపపరిహారం గావిస్తుంది. ఇదే సేవల యొక్క అంతరార్థం. మన చేత ఉపకారం పొందిన వందమందిలో ఏ ఒక్కరైనా సంతృప్తి చెందితే చాలు—అదే మనకు మంచి ఫలితాన్ని అందిస్తుంది.

## అజ్ఞానం — జ్ఞానం — బ్రహ్మతత్త్వం

చలించని మనస్సును, భ్రమించని దృష్టిని మనం అభివృద్ధి పరచుకోవాలి. అప్పుడు చేసిన పను లన్నీ భగవత్ప్రీత్యర్థంగా మారిపోతాయి. పుష్కరాలు 12 సంవత్సరములకు ఒకసారి వస్తాయి. ఈ పుష్కరాలలో మీరు ఈ సేవలను కూడా పుష్కలంగా చేసారు. అయితే, మన హృదయాలను కూడా పుష్కరంగా ఉంచుకోవాలి. అప్పుడే తగిన సార్థకత చేకూరుతుంది. "పుష్కర" మనగా పరిపూర్ణత్వమే. అట్టి పరిపూర్ణత్వమును పొందాలంటే, మనలోని రాగ ద్వేష, అహంకారాలను నిర్మూలం గావించుకోవాలి. మనం ఖర్చు పెట్టినా- పెట్టకపోయినా కాలం మాత్రం కదలిపోతున్నది. అట్లే మన జీవితంకూడా తరిగిపో తున్నది. కాని, మనం ఖర్చుపెట్టినా - పెట్టకపోయినా ఎప్పటికీ నిల్చేది—ఒక్క దైవానుగ్రహం మాత్రమే. దానిని మనం పొందాలి.

ఒక్కసారి పోతే తిరిగి రానిది, ఒక్కసారి వస్తే తిరిగి పోనిది, రాకుండా- పోకుండా స్థిరంగా ఉండేది—ఈ మూడు విషయాలను గూర్చి మానవుడు తెలిసికొనుటకు ప్రయత్నించాలి. ఒక్కసారి వస్తే తిరిగిపోనిది—అదే జ్ఞానం. వచ్చి - పోయేది జ్ఞానం కాదు. ఆ జ్ఞానం వచ్చిన తరువాత స్థిరంగా నిలిచి పోవాలి. ఒక్కసారి విశ్వాసం కలిగితే, ఆ విశ్వా సాన్ని పెంచుకొనుటయే మానవ కర్తవ్యం. మానవుడనగా "విశ్వాసం కలజీవి" అని ఉపనిషత్తు తెలిపియున్నది. కాని నేటి మానవులలో శ్వాస ఉన్నది గాని, విశ్వాసం లేదు. ఏమి ప్రయోజనం? విశ్వ సించిన దానిని ఆచరణలో పెట్టాలి. కొంతమంది "పూర్వం నాకు చాలా భక్తి ఉండేది కాని, ఇప్పుడు ఎందుకో సన్నగిల్లిపోతున్నది" అని అనుకొంటారు. ఇది చాలా పొరపాటు. ఇప్పుడు నీలో భక్తి సన్నగిల్లి పోతున్నదంటే, పూర్వం కూడా ఆ భక్తి నీలో స్థిరంగా ఉండియుండదు. భక్తి ఉంటే ఎప్పటికీ తగ్గి పోదు. తగ్గిపోతే భక్తి ఉండినది కాదు.

ఇంక రెండవది: ఒక్కసారిపోతే తిరిగి రానిది అదే—"అజ్ఞానం". మూడవది: పోకుండా-రాకుండా స్థిరంగా ఉండేది. అదే—"బ్రహ్మతత్త్వం". ఇది—"నిర్గుణం, నిరంజనం, సనాతనం, నికేతనం, నిత్య శుద్ధ బుద్ధ ముక్త నిర్మల స్వరూపం". అదే ఆత్మతత్త్వం.

## తమస్సు నిర్మూలిస్తే— అదే తపస్సు

మన దేహంలో గుండె కొట్టుకోవడానికి, ఉచ్ఛ్వాస-నిశ్వాసాలకు, రక్తం సరఫరా జరుగుటకు మనమెట్టి ప్రయత్నములు చేస్తున్నాము? ఏమీ చేయుట లేదు. ఈ కర్మలన్నీ వాటంతటవే సహజంగా జరిగి పోతున్నాయి. ఈ అన్నింటికి ఒక్క దైవత్వం ఆధారంగా ఉంటున్నది. ఇదే అన్నింటికీ మూలా ధారం, ఇదే అన్నింటికీ అధిష్ఠానం. 'వెండి' అనే మూలాధార పదార్థము నుండియే వెండిటంబ్లరు, వెండిగిన్నె మొదలగునవి ఆవిర్భవిస్తాయి. కాని,

'వెండి' అనే మూలాధారమే లేకపోతే, ఈ వెండి వస్తువులే ఉండవు. అదే విధంగా భగవంతుడనే అధిష్టానము నుండియే సర్వమూ ఆవిర్భవిస్తున్నది.

మనం సాధ్యమైనంత వరకు సేవలలో పాల్గొన్నచో—అంతకంటే గొప్ప సాధనలు లేవు. ఏదో జపము, ధ్యానము చేసుకొనేవారిని వద్దని చెప్పను. అవన్నీ చేసుకోవచ్చును గాని, సేవ చేయుట వలన కలిగే ఫలితం మరిదేని వలన కూడా కలుగదని నా ఉద్దేశ్యం. మన చరిత్రను పరిశీలిస్తే, పూర్వకాలంలో ఎంతోమంది తపస్సు చేసారు. కాని, ఏమి సాధించినారు? వారు చేసినది ఒకరినొకరు శపించుకోవడమే కదా! ఇదేనా తపస్సు యొక్క ఫలితం? ఇది కాదు తపస్సు. తమస్సును దూరం చేసికొన్నప్పుడు—అదే తపస్సుగా మారుతుంది. తమస్సును లోపల నింపుకొని, తపస్సు చేస్తే లాభం లేదు. జపములు, ధ్యానములు, యోగములు, యాగములు— మున్నగునవి సేవ కంటే అధికమైనవి కావు. కొంతమంది జపములు చేస్తుంటారు. చేతిలో జపమాల తిరిగిపోతూ ఉంటుంది గాని, వారు మాత్రం నిద్రపోతుంటారు. మరికొంతమంది ధ్యానంలో కూర్చొంటారు. ఆ సమయంలో ఎక్కడో చిన్న దోమ వస్తే, దానిని చంపివేస్తారు; ఇదేనా ధ్యానం? ఇలాంటి కాలము వ్యర్థం గావించే పనులలో మీరేమాత్రం ప్రవేశించకండి.

## గృహిణీ ధర్మాలు

మీ ఇంటి పనులనైనా చక్కగా చేసుకోండి. మీ ఇంటిని శుభ్రముగా ఉంచుకోండి. మీ భర్తను, పిల్లలను చక్కగా చూసుకోండి. దానిని మించిన కర్తవ్యం మరొకటి లేదు. అంతేగాని, ధ్యానమని ఊరకే కూర్చుంటే, మీ మనస్సంతా మార్కెట్‌లో తిరుగుతుంటుంది. కనుక, మీరు నిర్మలంగా భగవన్నామస్మరణ చేసుకుంటూ అన్ని పనులు చేసుకోవాలి. "అయ్యో! నేను పుష్కరాల సేవకు పోలేకపోతినే" అని బాధపడనక్కర లేదు. ఏదో సత్సంగానికి పోలేకపోవుట చేత చింతించనక్కర లేదు. మీ కర్తవ్యాన్ని మీరు నిర్వర్తించండి. మీరు ఇల్లు ఊడ్చే సమయంలో "నా హృదయాన్ని పరిశుద్ధం చేస్తున్నాను" అని అనుకోండి. ఎంత హాయిగా ఉంటుంది! మీరు చపాతీలు గాని, పూరీలుగాని చేస్తుంటారు. అయితే, వాటిని చేస్తున్నంతసేపు "ఈ పూరీలుచేసే కర్మ నాకు పట్టింది. దీని వలన ఆ సత్సంగమునకు పోలేకపోతున్నాను" అని తిట్టుకోనక్కర లేదు. "నేను చేసేది పూరీలు కాదు, నా హృదయాన్ని విశాలం చేసుకొంటున్నాను" అని అనుకుంటే— ఎంత బాగుంటుంది! వంట ఇంట్లో కూరగాయలు కోసేటప్పుడు, "ఇది నా తలవ్రాత. నాకీ వంట ఇల్లేనా గతి!" అని దూషించుకోరాదు. "నేను కోసేవి కూరలు కాదు. నాలోని అరిషడ్వర్గాలనే దుర్గుణాలను జ్ఞానమనే 'కత్తి'తో కోస్తున్నాను. ఈ కూరలను ప్రేమ అనే 'జలం'లో తడిపి, జ్ఞానమనే 'అగ్ని'లో ఉడకబెడుతున్నాను" అని భావించండి. అప్పుడావని ఎంతో పవిత్రతను పొందుతుంది. మీరు బియ్యంలోని రాళ్ళను ఏరివేస్తుంటారు. ఈవిధంగా బియ్యం నుండి రాళ్ళను వేరు చేసేటప్పుడు, "దుర్గుణాలను దూరం చేసి, సద్గుణాలను పెంచుకొంటున్నాను—ఇది నా యోగం" అని భావించండి. దానినే— "క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము"గా, "ఆత్మానాత్మ విభాగ యోగము"గా భావించుకోండి. ఈ విధంగా మీరు చేసే ఇంటి పనులను కూడా భగవత్కర్మలుగా స్వీకరించాలి.

చాలామంది తమతమ భార్యనుగాని, భర్తనుగాని, పిల్లలనుగాని సంతృప్తి పరచలేరు. అటువంటి వారంతా పుష్కరాలకు పోయి, ఇతరులను సంతృప్తి పరచుట గొప్పతనం కాదు. "ఇంట గెల్చి - రచ్చ గెల్చు". మీ ఇల్లును చక్కబెట్టుకొన్న తరువాత వీధిలోనికిపోయి సేవలు చెయ్యాలి. అంతేగాని, ఇంటిని విసర్జించరాదు. మన ఇంట్లో వారిని సంతృప్తిపరచుట

మన కర్తవ్యం. ఈ కర్తవ్యాన్ని నిర్వర్తించగ
మిగిలిన కాలాన్ని సమాజ సేవలో ఉపయోగపెట్టాలి
మీ ఇంట్లో వారిని బాధపెట్టి, వీధిలోనికి పోయి సే
చేయడమనేది — సాయి ఒప్పుకోడు. పున
గట్టిగా లేకుండా గోడలు నిలువలేవు కదా! కనుక
మొదట Self చూసుకో, తరువాతనే Help చేయి

## కర్మతో ప్రారంభమై—
## జ్ఞానంతో అంత్యం కావా

ప్రేమస్వరూపులారా! మీరు చాలా బా
సేవలు చేసారు. ఈనాడు ఆ సేవల ఫలితంగానే మీర
స్వామి దగ్గరకు రాగలిగారు, స్వామి ఇన్ని విధాలుగ
మీతో సంభాషణ సల్పారు. ఇదే "తపఃఫలం"
ఇలాంటి తపఃఫలమును అప్పటికప్పుడే మరచిపో
కుండా, జీవితాంతము దానిని సాధించుకొనుట
ప్రయత్నించాలి. దీనికొక ఉదాహరణ: మట్టిరోడ్డు
బస్సు ప్రయాణిస్తుంటే, దాని వెనకనే మట్టికూడ
లేస్తూ వస్తుంటుంది. అయితే, బస్సును నిలుపకుండా
పోయినంత కాలం ఈ మట్టి బస్సుపైన పడలేదు.
కాని, ఎక్కడైనా బస్సును నిలిపితే, వెంటనే వెనుక
మట్టి వచ్చి బస్సుపైన పడుతుంది. అయితే, బస్సును
తారురోడ్డు పైన నిలిపితే, ఇంక దానిపై మట్టిపడదు.
అదే విధంగా, మనం మొట్టమొదట కర్మమార్గంలో
ప్రయాణం చేస్తూ, క్రమక్రమంగా ఉపాసనామార్గంలో
ప్రవేశించాలి. ఉపాసనామార్గం "కంకర రోడ్డు"
వంటిది. ఇక్కడ "మట్టి" కూడా తక్కువగా
ఉంటుంది. ఈ ఉపాసనామార్గం నుండి మరల ప్రయా
ణిస్తూ జ్ఞానమార్గమనే "తారురోడ్డు"లో చేరాలి.
అంతవరకు మన కర్మలను మానకూడదు. అదే ఒక
దీక్ష. కర్మతో ప్రారంభమై జ్ఞానంతో అంత్యము
కావాలి. కర్మలను ఆచరిస్తూనే ఉండాలి. అప్పుడు ఆ
కర్మయే జ్ఞానంగా మారిపోతుంది. ఇది ఎట్లంటే—
పుష్పమును మనం పోషిస్తూవస్తే, అదే కాయగా
మారుతుంది. కాయను మనం రక్షించుకుంటూ వస్తే,
అదే పండుగా మారుతుంది. కాబట్టి పుష్పం—కర్మ
మార్గం, కాయ—ఉపాసనామార్గం, పండు—జ్ఞాన
మార్గం. కాని, ఈ మూడు ఒక్కటే.

కనుక కర్మ నుండియే జ్ఞానం లభిస్తుందనే
విశ్వాసాన్ని పెంచుకోవాలి. కర్మమార్గంలో ప్రవేశించ
కుండా జ్ఞానాన్ని పొందలేము. చాలామంది "నాకు
జ్ఞానం ఉంటే చాలులే" అని భావిస్తుంటారు. అటువంటి
వాడే అజ్ఞాని. కర్మలో మునిగినవాడే నిజమైన జ్ఞాని.

## మోహక్షయమే మోక్షం

కర్మల నాచరించుటకై కాయం ఏర్పడినది.
కనుక ఈ కాయంతో కర్మల నాచరించి కాలకర్మ
కారణకర్తవ్యాలను గుర్తించాలి. కాయమును కర్మ
నాచరించుటకై ఉపయోగించాలి. కర్మలను కాలాన్ని
సద్వినియోగ పరచుటకై చేయాలి. కాలాన్ని వ్యర్థం
గావించనప్పుడే, మన కర్తవ్యాన్ని నిర్వర్తించిన
వారమౌతాము. కాలాన్ని వ్యర్థం చేస్తే మనలో
తమోగుణం తాండవ మాడుతుంది. కాలమే పర
మాత్మ స్వరూపం. అందుచేతనే భగవంతుని—
"కాలాయనమః, కాలస్వరూపాయనమః, కాలాతీతా
యనమః" అని వర్ణిస్తారు. అంతేగాకుండా "సంవ
త్సరాయనమః" అని కూడా వర్ణిస్తారు. ఇట్టి కాలాన్ని
క్రియలచేత సార్థకం చేసుకోవాలి. మనం నిష్కామ
కర్మలనాచరించినప్పుడే మనకు మోక్షం కలుగుతుంది.
అయితే, మోక్షం అనగా ఏమిటి? మోహాన్ని
క్షయం చేసుకుంటే— అదే మోక్షం.

## దురభ్యాసాలను దూరం చేసికొనే విధానం

ఈ సేవలు చేయడానికి పుష్కరాలే రానవసరం
లేదు; మనం 12 సంవత్సరాలు వేచి యుండనక్కర
లేదు. ప్రతి నిత్యం మీకు సమయం దొరికినప్పుడు
సేవలు చేయండి. ఇరుగు పొరుగు వారితో
మంచిగా ఉండండి. ఒకరితో నొకరు పోట్లాడకుండా
[illegible]

వీలులేకపోతే పరవాలేదుగాని, అపకారం మాత్రం తలపెట్టవద్దు. Help Ever, Hurt Never. ఇదే సమస్త పురాణముల సారం ఈ విషయం సాయి సంస్థల వారికి చెప్పనక్కర లేదు. అందరికీ బాగా తెలుసు. కాని, కొంతమంది తమ పాత అలవాట్లను వదలలేకుండా ఉన్నారు. ఈ ఆచారాలను, అహంకారాలను, మమకారాలను తగ్గించుకోవడానికి ప్రయత్నించాలి. ఒకానొక వ్యక్తికి నల్లమందు తినే అలవాటు ఉండినది. అతడు వచ్చి, "స్వామీ! ఈ అలవాటును ఒక్కసారిగా వదలిపెట్టడానికి వీలుకాదు. ఏమి చేయాలి?" అన్నాడు. అప్పుడు, నేను చెప్పాను— "ఒక పలక మీద సుద్దముక్కతో ప్రతి దినం మూడుసార్లు "ఓం". అని వ్రాయి, ఈ విధంగా వ్రాసిన తరువాత మిగిలిన సుద్దముక్క అంత పరిమాణము గల నల్లమందు తీసుకో. ప్రతి దినము అదే సుద్దముక్కను ఉపయోగించి, ఈ విధానాన్ని అనుసరించు. నీ అలవాటు క్రమక్రమంగా తగ్గిపోతుంది" అన్నాను. ఆ విధంగా ఆతడు ప్రతిదినం ఆ సుద్దముక్కను ఉపయోగించి, మూడు సార్లు 'ఓంకారము' వ్రాసేటప్పటికి, ఆ సుద్దముక్క పరిమాణం తగ్గిపోతూ వచ్చింది; అతడు తినే నల్లమందు కూడా తగ్గిపోతూ వచ్చింది. కట్టకడపటికి ఆ సుద్దముక్క పూర్తిగా అరిగిపోయింది, ఆతని నల్లమందు తినే అలవాటు కూడా పూర్తిగా తగ్గిపోయింది.

ఈ విధంగా మన అలవాట్లను తగ్గించుకుంటూ రావాలి. అనగా మనం దైవచింతన నిరంతరం చేస్తుంటే, మన మనస్సు కూడా బాహ్య సంబంధమైన విషయాలలో ఆసక్తిని తగ్గించుకుంటుంది. ఏపని చేయడానికైనా సంకల్పం ప్రధానం. "నేను పని చెయ్యాలి". అనే సంకల్పం ఉంటే ఎన్ని పనులనైనా చేయవచ్చును. గ్రద్దకి ఎంతపెద్ద రెక్కలుండినప్పటికిని, దానికి ఎగరాలనే సంకల్పం లేకపోతే, ఒక్క అంగుళమైనా ముందుకు పోలేదు. "నేను నడవాలి, నాగూటికి చేరుకోవాలి". అని సంకల్పించుకుంటే చీమకూడా మైళ్ళదూరం ప్రయాణం చేస్తుంది. కనుక, "పనిచేయాలి" అనే సంకల్పం మనలో ఆవిర్భవించాలి. అప్పుడే సర్వకర్మలూ దిగ్విజయంగా జరుగుతాయి.

## యోగ క్షేమాలు

మీరందరూ చాలా బాగా సేవలు చేసి, మంచి పేరు సంపాదించారు. ప్రభుత్వం తరపున, ప్రజల తరపున మీకు మంచి పేరు వచ్చింది. దానిని మీరు నిలబెట్టుకోవాలి. భగవద్గీతలో "యోగక్షేమం వహామ్యహం" అని తెలుపబడినది. యోగము- అనగా సంపాదించుకొనుట; క్షేమము- అనగా సంపాదించుకొన్న దానిని కాపాడుకొనుట. మంచిపేరును సంపాదించుకోవడం గొప్పతనం కాదు, ఆ వచ్చిన పేరును కాపాడు కొనుటలోనే గొప్పతనం ఉన్నది. కనుక, మీరు పొందిన మంచి పేరును పోషించుకొని, కాపాడుకొని తిరిగి మున్ముందు ఇటువంటి సేవలలో పాల్గొని మీ జన్మసార్థకం చేసుకోవడమే గాక, ఇతరులకు కూడా తగిన సంతృప్తిని, ఆనందాన్ని అందిస్తారని నేను ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ నా ప్రసంగాన్ని విరమిస్తున్నాను.

—శ్రీవారి దివ్యబోధ
9—9—1991,
ప్రశాంతినిలయం.



గోదావరీ పుష్కరాలు

# సత్యసాయి సంస్థల సేవా కార్యక్రమాలు

ఈ సంవత్సరం గోదావరీ పుష్కరాల సందర్భంగా తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలకు చెందిన శ్రీ సత్యసాయి సేవా సంస్థలవారు గోదావరి తీర ప్రాంతాలైన కొవ్వూరు, రాజమండ్రిలలో అనేక సేవా కార్యక్రమాలను నిర్వహించారు పుష్కర మహోత్సవాలలో పాల్గొనుటకు విచ్చేయనున్న లక్షలాది యాత్రికుల సహాయార్థమై సేవా కార్యక్రమాలను చేపట్ట వలసిందిగా ఉభయ గోదావరి జిల్లాల కలెక్టర్లు చేసిన అభ్యర్థనను పురస్కరించుకొని అక్కడి సాయి సంస్థలు సుమారు 1400 మందికి పైగా సేవాదళ సభ్యులను వినియోగించినవి.

ప్రతి దినం ప్రాతఃకాలము నుండి రాత్రి 9 గంటల వరకు నిర్విరామంగా పనిచేస్తూ పదహారు వేలకు పైగా ఆహార పొట్లాలను యాత్రికులకు పంచి పెట్టుట, స్నానఘట్టాల వద్ద వృద్ధులకు, చిన్న పిల్లలకు చేయూత నందించి తోడ్పడుట— మున్నగు సేవా విధులను వీరు అత్యంత శ్రద్ధా సక్తులతో నిర్వర్తించారు. 12 రోజులపాటు జరిగిన ఈ ఉత్సవాల సందర్భంగా వచ్చిన మొత్తం యాత్రికుల సంఖ్య ఒక కోటి దాటి యుండినప్పటికి, భగవాన్ బాబా వారి దివ్యానుగ్రహం చేత సాయి సేవాదళ సభ్యులు ఈ అఖండ సేవా కార్యక్రమాలను నిర్విఘ్నంగా కొనసాగించి అందరి మన్నన లందుకొన్నారు.

వారి సేవాతత్పరతకు భగవాన్ బాబావారు సంతసించి, ప్రశాంతినిలయంలో ఆ సేవాదళసభ్యుల సమావేశం ఏర్పాటుచేయబడుటకు అనుమతి నిచ్చారు. భగవానుని అనుజ్ఞ మేరకు తూర్పుగోదావరి జిల్లాకు చెందిన 900 మంది సేవాదళసభ్యులు (350 మంది పురుషులు, 550 మంది స్త్రీలు) ప్రశాంతినిలయ మందిరంలో సమావేశమైనారు. ఈ సందర్భముగా శ్రీ బుల్లియ్యగారు ప్రసంగిస్తూ, పైన పేర్కొన్న సేవా కార్యక్రమాల గురించి సవివరంగా తెలియజేస్తూ— రాజమండ్రి ప్రాంతములో సేవలనందించిన వారందరికీ అక్కడి శ్రీ సత్యసాయి గురుకులంలో 'బస' ఏర్పాటు చేయబడినదని, వారికి ఆహార సదుపాయములను సమకూర్చే బాధ్యతను సాయిభక్తులు చేపట్టారని ఆయన తెలిపారు. భగవాన్ బాబావారిని రాజమండ్రికి విచ్చేసి, అక్కడి భక్తులను ధన్యుల చేయవలసిందిగా ప్రార్థిస్తూ ఆయన తమ ప్రసంగాన్ని ముగించారు.

స్వామి తమ దివ్యసందేశానంతరం అక్కడ చేరియున్న వారందరికీ ప్రసాదాన్ని పంచిపెట్టి, పాద నమస్కార భాగ్యాన్ని అనుగ్రహించి ఆశీర్వదించారు.

ఆనాటి (9-9-91) శ్రీవారి సందేశము ఈ సంచికలో ప్రచురింపబడినది.



# ఆత్మవిద్య : లౌకికవిద్య

"సంఘ మర్యాదలన్నీ గంగలో కలిసిపోయినవి. మానవజాతికి తృప్తియే మాయమైనది. శీలనైతిక విలువలన్నీ చితికిపోయినవి, చెదిరిపోయినవి. ఈ విధంగా నేటి మానవులలో మానవత్వమే క్షీణించిపోయినది".

విద్యార్థులారా

ఈ ప్రపంచంలో మానవుడు జీవించడానికి ఆహారం అత్యవసరం. కాని, మానవుడు కేవలం ఆహారం భుజించినంత మాత్రమున తృప్తిపడడు. ఆహారం వలన కడుపునిండునదేగాని, మనస్సునిండదు, హృదయం పండదు. కనుక, తిని కూర్చొనుట మానవ స్వభావం కాదు. తిని తిరగాలి, తిరిగి పని చేయాలి. పని చేయుట ద్వారా కలిగిన ఫలితాన్ని అనుభవించాలి. అయితే, పని చేయు సమయములో—"ఏమి చేస్తున్నాను? ఎందుకు చేస్తున్నాను? ఎలా చేస్తున్నాను?" అనెడి ఈ మూడు ప్రశ్నలను మానవుడు చక్కగా విచారించాలి. అప్పుడే కార్యమునందు విజయము సాధించి, ఆనందమును అందుకోగలడు. ఈవిధముగా చేయుట ద్వారా మానవుడు ప్రపంచంలో ఉన్న మంచిని గుర్తించి, దానిని తన అనుభూతిలో పెట్టుకొనుటకు ప్రయత్నిస్తాడు. మంచి కర్మల నాచరించుట ద్వారా వచ్చిన ఆనందాన్ని అనుభవిస్తాడు. అనుభవించిన ఆనందాన్ని పదిమందికి పంచిపెడతాడు. కనుక, అన్నముతో ప్రారంభమై, ఆనందముతో అంత్యం కావటమే జీవిత పరమావధి. ఇదే తైత్తిరియోపనిషత్తు అందించిన ప్రధాన ఉపదేశం.

## మంత్రమంటే ...

ఈ తైత్తిరియోపనిషత్తు కృష్ణయజుర్వేదము నందలి తైత్తిరియ శాఖలోనిది. ఈ ఉపనిషత్తు అతి పురాతనమైనది. దీని యందున్న ప్రతి ఒక్కటి మంత్రస్వరూపమే. మంత్రము అనగా కేవలం "ఓం నమో నారాయణాయ" అనే అష్టాక్షరి గాని, "ఓం నమఃశివాయ" అనే పంచాక్షరి గాని కాదు. "మనన త్రాణ సమ్మిళితం ఇతి మంత్రః" మననం చేసి, మనస్సు నందు స్థిరపరచుకొన్నదే—

మంత్రం. ఈ ఉపనిషత్తు నందు ప్రతి చిన్న పదము కూడా మంత్రస్వరూపకంగా ఆవిర్భవించి, వ్యాప్తి నొందినవి. "సత్యంవద - ధర్మంచర", "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" మున్నగు చిన్న చిన్న పదములే మంత్రస్వరూపాన్ని ధరించి, మానవులకు బోధల నందించి ఆనందాన్ని చేకూర్చుతున్నాయి.

ఈ ఉపనిషత్తు నందు గల మరొక విచిత్రమైన రహస్యమేమిటంటే— సాధారణంగా ఒక్కొక్క ఉపనిషత్తు ఒక్కొక్క స్థాయి వారికే సమన్వయమై ఉన్నవి. కాని, ఈ తైత్తిరియోపనిషత్తు నందలి దివ్యబోధలు బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాసాశ్రమాలకు చెందిన వారందరికీ సమత్వంగా సమన్వయమై ఉన్నవి.

## పంచాగ్నులు

ఈ తైత్తిరియోపనిషత్తు 'పంచాగ్నుల' ను గూర్చి కూడా ప్రబోధిస్తున్నది. ఉదరాగ్ని, మందాగ్ని, కామాగ్ని, శోకాగ్ని, బడబాగ్ని—ఇవే పంచాగ్నులు. 'ఉదరాగ్ని'—అనగా ఆకలి చేత మానవుని తపింప జేయునది. 'మందాగ్ని'—అనగా అమితంగా భుజించుట వలన కలిగే అజీర్ణము చేత తపింపజేయునది. 'కామాగ్ని'—అనగా చిత్తమును అనేక విధములైన వాంఛల చేత తపింపజేయునది.

ఇంక నాల్గవది శోకాగ్ని. ఇది లౌకికమైన చింతల వలన, వాంఛల వలన కలిగే శోకము కాదు. దైవదర్శనం పొందుటకై, దైవానందం నిమిత్తమై మానవుని తపింపజేయునదే—శోకాగ్ని. భగవద్గీత యందు మొట్టమొదటి అధ్యాయం—"విషాదయోగం" ఇక్కడ "విషాద"మనగా ఏమిటి? అర్జునుడికి విషాదము ఎందుకు కలిగినది? కేవలం లౌకిక సంబంధమైన విషయ వాంఛలతో బంధు మిత్రుల నిమిత్తమై తాను విచారమునకు గురియైనాడా? ఈ విధంగా ఏర్పడే విషాదమునకు 'యోగము' అనే సార్థకనామం కలుగదు. కనుక లౌకిక సుఖదుఃఖముల నిమిత్తమై, ధన కనక వస్తు వాహనాదుల నిమిత్తమై అర్జునుడు శోకించలేదు. యుద్ధం వలన అనేక ప్రాణులు నశిస్తాయి. వర్ణసంకరము ఏర్పడుతుంది. ధర్మగ్లాని కలుగుతుంది—ఈ విధమైన ధర్మమును లక్ష్యమందుంచుకొని, దైవమును దృష్టి యందుంచుకొని అర్జునుడు విషాదమునకు గురియగుట చేత అది "విషాదయోగము"గా రూపొందినది. ఇట్టి దైవ సంబంధమైన, ధర్మ సంబంధమైన తపనకే "శోకాగ్ని" అని పేరు.

ఐదవదైన 'బడబాగ్ని' భయంకరమైన రోగముల చేత, బాధల చేత, మరణము చేత మానవుని తపింప జేస్తుంది. ఈ పంచాగ్నులు కేవలం భౌతికమైన శరీరమునకు సంబంధించినవి మాత్రమే, తద్భిన్నమైన ఆత్మకు సంబంధించినవి కావు. ఈ పంచాగ్నులకు ఆత్మ సాక్షీభూతుడై ఉంటున్నాడు. ఇట్టి సాక్షీభూతుని తత్త్వాన్ని జగత్తునకు చాటే నిమిత్తమై తైత్తిరియోపనిషత్తు పంచాగ్నుల యొక్క ప్రమాణములను ఆధారముగా చేసికొని ప్రజలకు బోధిస్తున్నది.

## చతుర్విధ మానవులు

మానవులయందు నాలుగు విధములైన తరగతులకి చెందినవారుంటున్నారు. 1. మానవ దైవత్వం. 2. మానవ మానవత్వం. 3. మానవ దానవత్వం. 4. మానవ పశుత్వం. ఈ నాలుగు తరగతులకు చెందిన మానవుల గురించి తైత్తిరియోపనిషత్తు చక్కగా వివరించినది. మొట్టమొదటిది మానవ దైవత్వం. దైవత్వాన్ని హృదయమునందు నింపుకొని, సర్వులయందు ఉన్న ఆత్మతత్త్వమే తనయందున్నదని విశ్వసించి, సర్వప్రాణుల యెడల దయ, ప్రేమలను కలిగి యుండి, సర్వకర్మలను భగవత్ప్రీత్యర్థంగా ఆచరిస్తూ, తన జీవితాన్ని దైవార్పితం గావించుటయే మానవ దైవత్వం యొక్క లక్షణం.

రెండవది: మానవ మానవత్వం. సత్యధర్మాలను దృష్టి యందుంచుకొని, వాటిగురించి ప్రచార ప్రబోధలు

నల్పుతూ, దయాంతఃకరణముతో దానధర్మాలు చేస్తూ, త్రికరణశుద్ధితో తన కర్తవ్య కర్మలను నిర్వర్తిస్తూ, మానవుడు మానవత్వాన్ని పోషించుకొనే నిమిత్తం అవతరించినాడని గుర్తించి వర్తించుటయే—మానవ మానవత్వం. మూడవది: మానవ దానవత్వం. ఈ కోవకి చెందిన మానవుడు సురాపానమునందాసక్తుడై, దయా ప్రేమ రహితుడై, స్వార్థ స్వప్రయోజనము లకై పరులను బాధిస్తూ దానవుని వలె జీవితాన్ని గడుపుతాడు.

ఇంక నాల్గవది మానవపశుత్వం. ఇంద్రియా భోగమే జీవితపరమావధి అని భ్రమించి, పుట్టినది మొదలుకొని గిట్టునంత వరకు ఆహార నిద్రా భయ మైధునాలతో జీవితాన్ని గడుపుతూ, మానవత్వాన్ని పూర్తిగా విస్మరించుటయే—మానవపశుత్వం యొక్క లక్షణం. ఆహార నిద్రా భయ మైధునాలు మనుష్యు నకు, పశువునకు సమానమే. ఐతే మనుష్యునకు, పశు వునకు మధ్య గల వ్యత్యాసమేమిటి? "జ్ఞానేన శూన్యః పశుభిస్సమానః" అనగా నిత్యానిత్య విషయపరిశీలనా జ్ఞానము శూన్యమైనప్పుడే మానవుడు పశువుతో సమా నుడౌతాడు. హృదయము నందు స్వార్థ స్వప్రయోజ నములను నింపుకొన్న వ్యక్తిమాత్రమే ఇట్టి నిత్యా నిత్యవిషయ పరిశీలనకు పూనుకొనడు. కనుక, మానవుడిగా జన్మించి పశుగుణములను కలిగియుండి, పశుప్రవర్తన యందే జీవితాన్ని అంకితము గావించు కోవడం— ఇదే మానవపశుత్వం యొక్క లక్షణం.

## సంఘమనగా....

మానవుడు సర్వశ్రేష్ఠమైన దైవత్వాన్ని పొందుటయే ఉత్తమమార్గం, అట్టి దైవత్వాన్ని పొందుటకు సాధ్యం కానప్పుడు, కనీసం మానవత్వా న్నైనా అభివృద్ధి పరచుకొని, జీవితాన్ని సార్థకం చేసుకోవాలి. అంతేగాని, మానవుడు దానవుడుగా లేక పశువుగా మారుట ధర్మ విరుద్ధం. ఈనాడు ఇట్టి ధర్మ విరుద్ధమైన చర్యలు జగత్తు నందు వ్యాపించి ఉండుట చేత మానవత్వమే మరుగున పడిపోతున్నది. నీతి నిజాయితీలు, సంఘమర్యాదలు శూన్యమైపోయి నవి. మానవుడు "సంఘము" అనే పదాన్ని సరిగా అర్థం చేసికొనలేక, జీవితాన్ని వ్యర్థం చేసుకుంటు న్నాడు. కేవలం మనుష్యుల యొక్క చేరికయే— "సంఘము" అని భావిస్తున్నాడు. కాదు, కాదు. అనేకత్వములో ఉన్న ఏకత్వాన్ని గుర్తింపజేయునదే- "సంఘము". అందరూ కలిసి ఏకకాలంలో ఏక కర్మను ఆచరించి, ఆ కర్మఫలితాన్ని ఏకాత్మభావంతో అనుభవించాలి. ఇదే సంఘము యొక్క ప్రధా నమైన ధర్మం. నిజమైన సుఖాన్ని సంఘము ద్వారానే అనుభవించడానికి సాధ్యమౌతుందనే సత్యాన్ని మానవుడు గుర్తించాలి. ఇదే 'సంఘం' యొక్క అంతరార్థం. అనగా మానవుని సుఖ-సంతో షాలన్నీ సమాజముపైననే ఆధారపడి ఉంటాయి. సంఘమే లేకుండిన, మానవుడే లేడు.

## ప్రేయోమార్గం — శ్రేయోమార్గం

తైత్తిరీయోపనిషత్తు పంచాగ్నుల యొక్క ప్రమాణాలను గురించి, నాలుగు తరగతులకు చెందిన మానవులనుగూర్చి చక్కగా వివరించడమే గాకుండా, గురుకులంలో తమ విద్యాభ్యాసమును పూర్తిజేసుకొని గృహస్థాశ్రమములో ప్రవేశించబోయే విద్యార్థులు తమ జీవితంలో ఎట్టి మార్గాన్ని అనుసరించవలెనో ఉపదేశించుచున్నది. "ప్రేయోమార్గం, శ్రేయోమార్గం" అని రెండు విధములైన మార్గములుంటున్నవి. ప్రేయోమార్గములో మానవుడు తాత్కాలికమైన ఆనం దాన్ని అందించే ఇంద్రియ సుఖములనాశించి, తత్ఫలి తాన్ని అనుభవిస్తాడు. చాలామంది ఇట్టి అనిత్యమైన, అసత్యమైన ప్రేయోమార్గమునే ఆశిస్తున్నారు, అనుస రిస్తున్నారు. మంచి ప్రవర్తన, మంచిగుణములు, మంచిజ్ఞానం ఆశించి, అనుభవించుటయే— శ్రేయో మార్గం. కాని, మానవుడిట్టి నిత్య సత్యమైన మార్గము నాశించుట లేదు. కారణమేమిటంటే—శ్రేయోమార్గం

నందు సత్ఫలితాలకు కొంతకాలము పడుతుంది. కాని, తానాశించిన ఫలితాలను ఆలస్యముగా అనుభవించుటకు మానవుడు ఇష్టపడడు. తాను ప్రతివిషయానికి పరుగులిడతాడు. తనకు అనుకూలమైన ఆశలను మాత్రమే దృష్టియందుంచుకుంటాడు. అప్పటికప్పుడు గొప్పపదవులు, కీర్తిప్రతిష్ఠలు కావాలని కోరుతుంటాడు. ఇట్టి తాత్కాలికమైన విషయాలను ఆశించుటయే- ప్రేయోమార్గము.

"శిక్షావల్లి"

విద్య యొక్క పరమావధి వినయమే. విద్యకు నమ్రతయే ప్రధానమైన దృష్టి, శీలమే ప్రాణము. "మాతృదేవోభవ, పితృదేవోభవ", "సత్యంవద, ధర్మంచర" అని శిక్షావల్లి తెలుపుచున్నది. మొట్టమొదట తల్లిదండ్రులను గౌరవించాలి. మీరు జీవితములో ఎట్టి పరిస్థితులందైననూ సత్యాన్ని వీడరాదు, ధర్మాన్ని తప్పరాదు— ఈ విధమైన పవిత్ర బోధలను "శిక్షావల్లి" అనే పేరుతో తైత్తిరియోపనిషత్తు ఆనాటి విద్యార్థులకందించి, వారిని సన్మార్గములో ప్రవేశపెట్టి, వారి మానవత్వాన్ని దివ్యత్వంగా మార్చగలిగినది.

నీవు ఏ పని చేసినా దాని ఫలితం అనుభవిస్తావు. ఈనాడు నీ స్నేహితుని నీవు మోసగిస్తే, భవిష్యత్తులో నీ స్నేహితుడే నిన్ను మోసగిస్తాడు. ఈనాడు నీ తల్లిదండ్రులను నీవు గౌరవిస్తే, రేపు నీ బిడ్డలు కూడా నిన్ను గౌరవిస్తారు. భవిష్యత్తుయొక్క ఈ మంచి-చెడ్డలన్నింటిని వర్తమానము నందే విడమర్చి, ముక్తమైన స్వరూపాన్ని అందించినది తైత్తిరియోపనిషత్తు.

## సంకుచితమైన చైతన్యం - అనంతమైన చైతన్యం

సర్వత్రా నిండి యున్నది బ్రహ్మతత్వమే. బ్రహ్మతత్వమనగా విశాలమైన చైతన్యం. ఈ చైతన్యం ప్రతి మానవుని యందు సమానంగా ఉంటున్నది. సర్వత్రా వ్యాపించియున్న చైతన్యంతో పోల్చినచో, మానవుని యందున్న చైతన్యము సంకుచితముగా రూపొందుతుంది. కనుక, మానవుని యందున్నది సంకుచితమైన చైతన్యము, సర్వత్రా వ్యాపించి యున్నది అనంతమైన చైతన్యము. ఈ అనంతమైన చైతన్యం లోపల సంకుచితమైన చైతన్యమును చేర్చాలి. ఇదెట్లు సాధ్యమౌతుంది? దీనికొక ఉదాహరణ : గాలి సర్వత్రా వ్యాపించియున్నది. ఒక బెలూన్‌లో గాలి నింపినప్పుడు, అందులోని గాలి ఆ బెలూన్‌కు మాత్రమే పరిమితమై ఉంటుంది. అయితే, ఈ సంకుచితమైన గాలి సర్వ వ్యాపకమైన గాలిలో చేరాలంటే ఏమి చేయాలి? ఆ బెలూన్‌లో గాలిని అధికంగా నింపినకొలది దాని పరిమాణం పెరిగి, చివరకు అది ప్రేలిపోతుంది. ఈ విధంగా ఆ బెలూన్‌లోని సంకుచితమైన గాలి అనంతమైన గాలిలో లీనమైపోతుంది. అట్లే, మానవ దేహమనే బెలూన్‌లో ఉండిన చైతన్యమనేది సంకుచితంగా ఉంటున్నది. "నేను—నావారు" అనేభావం చేతనే ఈ చైతన్యం సంకుచితమైయున్నది. దీనిని అనంతముగా వ్యాపింపచేయాలంటే— "నా యందున్న ఆత్మయే అందరి యందున్నది" అనే ఏకత్వాన్ని మనము అభివృద్ధి పరచుకోవాలి. మన హృదయంలో ఇట్టి అనంతమైన భావాన్ని కలిగియున్నప్పుడు, ఈ సంకుచితమైన చైతన్యం అనంతమైన చైతన్యంలో లీనమైపోతుంది. కనుక, మనము సంకుచిత భావాలను దూరము చేసికొన్నప్పుడే ప్రపంచములో సుఖ-శాంతులను అనుభవిస్తాము.

## శ్రేయోమార్గమునందే మానసిక తృప్తి

ఈనాడు ప్రపంచంలో జరిగే దురాచారాలకు మూలకారణం స్వార్థ స్వప్రయోజనాలతో కూడిన సంకుచితమైన స్వభావమే. మానవుని కష్ట-నష్టములు వెంటాడుతునే ఉంటాయి. కాని, వాటికి చెదరక, బెదరక స్థిరంగా ఉండాలి. మానవుడు తన అంత

రాత్మను తృప్తిపరచే విషయాలలో ప్రవేశించాలి. అంతరాత్మ ప్రబోధలనే అనుసరించాలి. అదే నిజమైన జీవితమార్గం. కాని, ఈనాడు ఇట్టి గుణములను పోషించుకొనే విద్యలను విద్యార్థులు అభ్యసించుట లేదు. వారు కేవలం గ్రంథపరిచయంతో తృప్తి పడుతున్నారు. దీని వలన ప్రయోజనం లేదు. ఆత్మ విద్యయే నిజమైన విద్య. మిగిలిన విద్యలన్నీ అపర విద్యలే. ఇవి కేవలం పొట్టకూటి కోసం ఏర్పడినవి. ఈ అపరవిద్యలు కూడా అవసరమే. కాని, వీటితో పాటు ఆత్మవిద్యను కూడా మనము అభ్యసించాలి. మానవునికి కేవలం శరీరం, ఇంద్రియాలు మాత్రమే ఉండినచో ఆహార నిద్రా భయమైథునాలతో జీవితాన్ని సార్థకం చేసుకోవచ్చును. కాని, వీటికి అతీతమైన మనస్సు, బుద్ధి, ఆత్మ కూడా మానవుని యందుంటున్నాయి. వాటి యొక్క తృప్తి కూడా దృష్టి యందుంచుకోవాలి. "కడుపునిండ తిండి, కంటినిండ నిద్ర, ఇంటినిండ పిల్లలు"- ఇదే జీవితపరమావధి అని మానవుడు భావిస్తున్నాడు. ఇది ఒక సంకుచితమైన భావమే. దీని వలన మానసిక తృప్తి కలుగదు. ఒక్క శ్రేయో మార్గమునందే మానసిక తృప్తి లభిస్తుంది, మానవత్వానికతీతమైన దివ్యమైన తత్త్వం లభిస్తుంది. ఇట్టి దివ్యమైన భావమే లేకున్న మానవత్వమే శూన్యమైపోతుంది.

## ప్రేమయే దైవం — దైవమే ప్రేమ

మానవత్వాన్ని పెంచుకొనే విధానాన్ని అనుసరించాలి తల్లిదండ్రులను, తోటి మానవులను ప్రేమించలేనివాడు భగవంతుని ఏరీతిగా ప్రేమించగలడు? ఇది సాధ్యమా? కాదు, అసాధ్యము. కనుక, మొట్టమొదట తోటి మానవులను ప్రేమించుటకు ప్రయత్నించాలి. ఈ ప్రేమ పెరిగి, క్షీణించేది కాదు. ఎప్పుడూ పెరుగుతునే ఉంటుంది, ఇదే అనంతమైన తత్త్వం. అందుచేతనే, "ప్రేమయే దైవం—దైవమే ప్రేమ" అన్నారు.

విద్యార్థులారా! కేవలం లౌకికవిద్యలే ప్రధానమైనవని భావించకండి. మానవత్వం లేని విద్యలెన్ని ఉండినప్పటికిని ప్రయోజనం లేదు. అన్నింటికి ఆధారమైన ఆత్మవిద్యను మనము అభ్యసించాలి. అదే మూలం. లౌకికవిద్య స్థూలం. మూలం లేకుండా స్థూలం ఉండదు కదా! అదేవిధంగా ఆత్మవిద్య ఆధారం; లౌకికవిద్య ఆధేయం. ఆధారాన్ని వదలి, ఆధేయాన్ని పట్టుకొని మనం అవస్థలకు గురియౌతున్నాము. కనుక, మనము ఆత్మవిద్యను ఆధారంగా చేసికోవాలి. దీని వలననే సర్వమూ గుర్తించడానికి వీలౌతుంది. ఒక్క ఆత్మవిద్యను తెలుసుకుంటే, అన్నీ తెలుసుకున్నవారమౌతాము. ఉపనిషత్తులు ఇట్టి సత్యాన్నే బోధిస్తున్నవి.

ఈనాటి విద్యావిధానంలో వేదాలను, ఉపనిషత్తులను, పురాణాలను బోధించుటకు ఏమాత్రము అవకాశం లేకుండా ఉన్నది. మానవత్వము యొక్క పరిపూర్ణమైన విలువలన్నీ వాటి యందే ఉంటున్నాయి. మానవులు అట్టి విలువైన "మణుల"ను విడిచిపెట్టి, 'బొగ్గుల' వంటి లౌకికమైన విషయాలకోసం ప్రాకులాడుతున్నారు. ఈ 'బొగ్గుల' వలన మనకేమాత్రము ప్రయోజనం లేదు. మణులను సంపాదించుకోవడానికి ప్రయత్నించాలి. అయితే, ఈ "డైమండ్స్" ఏరీతిగా మనకు లభిస్తాయి? మనోనాశనము (డై—మైండ్) ద్వారానే 'డైమండ్' లభిస్తుంది. అనగా ఈ లౌకికమైన విషయములందు మనస్సు నాశనము గావింపబడినప్పుడే, మనకు ఈ విలువైన "మణులు" లభిస్తాయి. కనుక మన మనస్సును లౌకికమైన విషయాలలో ప్రవేశపెట్టరాదు.

ఈనాడు గొప్పగొప్ప విద్యావంతులు కూడా కేవలము లౌకికమునందే వారి జీవితాన్ని అంత్యము చేసుకుంటున్నారు. ఎంతకాలమైనప్పటికీ తిన్నకడుపుకే తింటున్నారు, కడిగిన ముఖమునే కడుగుతున్నారు. కాని, జీవితపరమావధి

అంటే ఏమిటో అర్థము చేసికొనుట లేదు. మానవుడు తానెంత దబ్బైనా సంపాదించి స్వదేశ బ్యాంకులలో పెట్టుకోవచ్చు. లేదా, అవసరమైతే విదేశ బ్యాంకులలో కూడా పెట్టుకోవచ్చు. కాని, అతను రాను రాను కాలం చెల్లిపోయి కళ్ళుమూసుకుంటే, ఆ ధనమంతా తాను వాడుకొనలేక వ్యర్థమైపోతుంది. కనుక, మనం జ్ఞానధనాన్ని సంపాదించుకోవాలి.

## మానవత్వాన్ని పోషించే విద్యలుకావాలి

నిజమైన విద్యాధనం చాలా విలువైనది. కాని, నేటి విద్యలన్నీ నిరుపయోగములైనవే. ఈనాడు విద్యార్థి పరీక్షల నిమిత్తమై రాత్రింబవళ్ళు కష్టపడి చదివి, పుస్తకంలో ఉన్న విషయాలను తన మస్తకములోనికి చేర్చుకొని, పరీక్షలకు హాజరవుతున్నాడు. అక్కడ తన తలలో ఉన్నదంతా పేపర్లో గ్రుమ్మరించి, తలను ఖాళీ చేసుకొని ఇంటికి చేరుకొంటున్నాడు. దీనివలన ఏమి ప్రయోజనం? ఒకవారం రోజుల తరువాత అతనిని తిరిగి ప్రశ్నిస్తే, దానికి జవాబు దొరకదు. ఇట్టి పొట్టకూటి విద్యల వలన జగత్తునకేమాత్రము ఉపయోగము లేదు. అందుచేతనే ఈనాటి విద్యార్థులలో వివేకము క్షీణించి అల్లర్లు, అలజడులు చెలరేగుతున్నాయి. వీరికి గురువు యెడల గౌరవము లేదు, తల్లిదండ్రులపై ప్రేమ లేదు, ప్రజలంటే అభిమానము లేదు. ఇంక, వీరిలో మానవత్వమెట్లు అభివృద్ధి చెందుతుంది? ఈనాటి మానవుని కంటే పశువులే మేలనిపిస్తున్నది. అవి ఏ యూనివర్సిటీకి వెళ్ళుతున్నాయి? ఏ డిగ్రీలు పొందుతున్నాయి? ఏ అధికారాలు చేపడుతున్నాయి? ఏదీ లేదు. కాని, వాటికి తగ్గ నీతినియమాలను సంపాదించుకొంటున్నాయి. కనుక, విద్యార్థులు మొట్టమొదట నీతినిజాయితీలను అభివృద్ధి గావించుకోవాలి. జగత్కల్యాణానికై కృషి చేయాలి.

శ్రీవారి దివ్యబోధ
30—5—1991,
బృందావనం.

# పరమాత్ముడు పుట్టినరోజు

శా॥ ముమ్మూర్తుల్ తమ మూల తేజమునకున్ మూర్తిత్వమున్నీయ; వి
శ్వమ్మున్ సంస్కరణమ్ము సేయుటకు విశ్వప్రేమ సంపూర్ణ స
త్వమ్మున్ గైకొని పర్తిలో నుదయమై భాసిల్లు నీజన్మ ప
ర్వమ్మే మాకిల శ్రేయమున్నిడు మహాపర్వంబు సాయీశ్వరా!

శా॥ కాలాతీతుడవీవు — కాలమును లెక్కంగట్టి పుట్పర్తిలో
లీలల్ జూపగ "అర్వదారయన" కార్తీక ద్వితీయంబునన్
కాలున్ బెట్టితివయ్య! సత్య శివమౌకల్యాణ రూపంబునన్
లీలామానుష విగ్రహా! వరద! నిర్లిప్తాత్మ సాయీప్రభూ!

—నారాయణ చరణం, ప్రశాంతినిలయం.

# ప్రేమస్వరూపం - దేవీతత్త్వం

"ప్రేమయే దైవం. ఈ జగత్తంతా ప్రేమమయం. కనుక ప్రేమను పరిపూర్ణముగా కలిగి యున్న మానవుడు అద్వితీయమైన తత్త్వమును పొందుటకు అర్హుడగును. ఇట్టి పవిత్రమైన ప్రేమ తత్త్వమును ప్రజలకు బోధించే నిమిత్తమై దివి నుండి భువికి దిగివచ్చిన దివ్యమైన ప్రేమస్వరూపమే—ఈ శ్రీ మాత సాయిమాత".

ప్రేమస్వరూపులారా!

మానవుడు తనను తాను మరచిపోయి, తన తత్త్వమును విస్మరించి దివ్యత్వమును ఆశించుటయే "పవిత్రమైనప్రేమ" అని పిలువబడుతుంది. మానవ హృదయంలో ఈ ప్రేమ అనే "రత్నం" ప్రకాశిస్తున్నప్పుడే దివ్యమైన, భవ్యమైన, నవ్యమైన—తలంపులు అతనిలో ఆవిర్భవిస్తాయి. దురదృష్టవశాత్తు నేటి మానవులలో క్రూరమృగముల తత్త్వం విజృంభిస్తున్నది. కలియుగ ప్రభావము చేత మానవులలో దయా ప్రేమలు శూన్యమైపోతున్నాయి, కేవలం ఆడంబరమైన జీవితముపై మోజు అధికమైపోతున్నది. నిజమైన ప్రేమ తత్త్వం మానవుని యందు కానరావటము లేదు. ప్రతి ఒక్కరు "భగవంతుని ప్రేమిస్తున్నాము" అని చెప్పుకోవచ్చును గాని, భగవంతునిపై నిజమైన ప్రేమను కలిగియున్నవారు కోటికి ఏ ఒక్కరు కూడా కనిపించుట లేదు. మానవుడు సుఖ-సంతోషాల ననుభవిస్తున్నప్పుడు భగవంతుని వర్ణించుట, కష్ట నష్టాల ననుభవిస్తున్నప్పుడు భగవంతుని దూషించుట అనే భేదభావము కలిగియున్నప్పుడు, అది భగవత్ప్రేమ అనిపించుకోదు. సుఖ-దుఃఖములకు పొంగక, కృంగక సమత్వమును వహించిన ప్రేమయే భగవత్ప్రేమ. ఈ జగత్తు నందు మానవుని అనేక రకములైన బాధలు వెంటాడుతుంటాయి. అయితే, అవన్నీ కదిలిపోయే మేఘముల వంటివే గాని, స్థిరమైనవి కావు. కేవలము దైవ ప్రేమ మాత్రమే నిత్య సత్యమైనది. కనుక మానవుడు ప్రేమమయంగా మారాలి. అప్పుడే అతనికి జగత్తంతా ప్రేమమయంగా గోచరిస్తుంది.

మనం ఎట్టి రంగు అద్దాలను ధరిస్తామో, ఈ జగత్తంతా అట్టి రంగుతో కనిపిస్తుంది. "యద్భావం తద్భవతి" మానవుడు ప్రేమమయుడిగా మారినప్పుడే, ఈ జగత్తంతా బ్రహ్మమయంగా గోచరిస్తుంది.

మానవుడు ద్వేషభావాన్ని కలిగియున్నంత వరకు ఈ జగత్తంతా ద్వేషమయంగానే కనిపిస్తుంది. కనుక మంచి-చెడ్డలు రెండూ మనస్సులోనున్న ప్రతిబింబాలే. ఈ మంచి-చెడ్డలకు మనస్సే సాక్షి. మనం ప్రేమను అభివృద్ధి గావించుకున్నప్పుడు మంచి-చెడ్డ అనే భేద భావము లేక, ఏకాత్మభావంతో ఆనందాన్ని అనుభవించవచ్చును.

## 'తరువ తరువ బుట్టు తనువున తత్త్వంబు'

"తరువ తరువ బుట్టు తరువున అనలంబు" రెండు కట్టెల రాపిడి చేత అగ్ని ఆవిర్భవిస్తుంది. అయితే ఈ రెండు కట్టెల యందు అగ్ని దాగి ఉంటున్నదనే సత్యాన్ని మనం గుర్తించాలి. ఈ కట్టెలలో అగ్ని అగోచరంగా ఉండుట చేతనే, రెండు కట్టెల రాపిడి వలన అగ్ని ఆవిర్భవిస్తున్నది. అనగా, సాధన చేత గుప్తంగా దాగియున్న అగ్ని బహిర్గతమౌతున్నది. ఈ జడమైన మానవ దేహములను కూడా కట్టెలతో పోల్చవచ్చును. మన రెండు చేతుల యందు అగ్ని దాగి ఉంటున్నది. అయితే ఈ రెండు చేతులకు ఒకదానితోనొకటి రాపిడి జరిపినప్పుడు, వీటి యందున్న అగ్ని వేడిగా ఆవిర్భవిస్తున్నది. ఈ రాపిడి చేత చేతుల యందు దాగియున్న అగ్నియే బహిర్గతమౌతున్నది

"తరువ తరువ బుట్టు దధిని ఘృతము" పాలలో ప్రతి బిందువునందు వెన్న ఉంటున్నది. కాని, ఆ పాలను చేతియందుంచుకొని "వెన్న ఎక్కడున్నది?" అని ఎంతకాలము విచారించినప్పటికీ, ఆ వెన్న మనకు సాక్షాత్కరించదు. ఏట్టి మార్గము ననుసరిస్తే వెన్నను పొందవచ్చునో, అట్టి మార్గము ననుసరించాలి. ఆ పాలను పెరుగుగా మార్చి, ఆ పెరుగును మథనము చేసినప్పుడు పాలలో సర్వత్రా వ్యాపించియున్న వెన్న సాక్షాత్కరిస్తుంది. అయితే, ఈ విధంగా లభ్యమైన వెన్నను తిరిగి మజ్జిగ యందు కలిపినప్పటికీ, అది మజ్జిగలో కలసిపోదు. అదే విధంగా, "తరువ తరువ బుట్టు తనువున తత్త్వంబు" మానవ దేహమునందే ఒక దివ్యమైన శక్తి సర్వత్రా వ్యాపించి యుంటున్నది. మన తనువునందే ఉన్న ఈ దివ్యమైన శక్తి సాధన చేత ఆవిర్భవిస్తుంది ఇట్టి దివ్యమైన శక్తి ఒక్కసారి సాక్షాత్కారమైన తరువాత తిరిగి ఆ దేహంలో ప్రవేశించదు. కనుకనే "దేహోదేవాలయ ప్రోక్తో జీవోదేవ స్సనాతనః" అన్నారు.

## గుడిగోపురాలు

మానవ దేహం ఒక దేవాలయం వంటిది. ఇటువంటి దేహాన్ని మనం సద్వినియోగ పరచుకోవాలి. మానవుడు సద్గుణాలను కలిగియుండి, సదాచార సంపన్నుడై, దేహాన్ని సరియైన మార్గంలో ప్రవేశ పెట్టాలి. మానవ దేహమనే మందిరము యొక్క పవిత్రతను పురస్కరించుకొనియే దైవము యొక్క శక్తి సామర్థ్యాలు వ్యాప్తమౌతుంటాయి. దేహమును చూసిన తక్షణమే మనకు దేవుడు జ్ఞప్తికి రావాలి. దేవాలయము భగవంతుని జ్ఞప్తికి తెప్పిస్తుంది. అందు చేతనే మానవుడు దేవాలయాన్ని చూసి దానిలోపల ప్రవేశిస్తాడు గాని, దేవుని చూసి కాదు.

ఇట్టి పవిత్రమైన ప్రబోధలు సల్పే నిమిత్తమై ప్రాచీన భారతీయులు గ్రామ గ్రామమునందు దేవాలయాలను చాలా ఎత్తైనవిగా కట్టేవారు. కాని, వారు వెఱ్ఱితనంతో ధనమును వ్యర్థం చేసే నిమిత్తమై పెద్ద పెద్ద గోపురాలను కట్టించలేదు. గ్రామములో నున్న ప్రజలకు ఆ ఎత్తైన గుడి గోపురాలు కనిపించిన తక్షణమే తెలియకుండానే వారియందు దైవభావము ఆవిర్భవించేది. ఈ విధంగా మానవునియందు నిరంతరం దైవత్వాన్ని ఆవిర్భవింపజేసే తలంపులు ఉద్భవింపజేయాలనే ఉద్దేశ్యంతోనే ఆనాటివారు ఎత్తైన గోపురాలను నిర్మింప జేసారు.

## " ఎవరికి వారే యమునా తీరే "

నేటి ఆధునిక యుగము నందు మానవులు అనేక అపోహలకు గురియై, నిత్య సత్యమైన దివ్య త్వాన్ని విస్మరించి, కేవలం లౌకికమైన తలంపులతో జీవితాన్ని వ్యర్థం గావించుకొంటున్నారు. మానవుని యందు మొట్టమొదట ప్రేమ అభివృద్ధి కావాలి. ఈ ప్రేమ లౌకికమైనదిగా ఉండరాదు. మానవ జన్మ నెత్తినందుకు దేహ సంబంధమైన బాంధవ్యము లేర్పడుతుంటాయి. కాని, పుట్టక పూర్వము- తల్లి ఎవరు? బిడ్డ ఎవరు?. పెండ్లి కాక పూర్వం- భర్త ఎవరు? భార్య ఎవరు? వివాహము జరిగిన తరువాతనే భార్యాభర్తల సంబంధం ఏర్పడుతున్నది. పుట్టిన తరువాతనే తల్లి- బిడ్డల సంబంధం ఏర్పడుతున్నది. ఈ సంబంధములన్నీ మధ్యలో వచ్చి, తిరిగి మధ్యలోనే పోవునటు వంటివి. కాని, పుట్టక పూర్వము- పుట్టిన తరువాత, గిట్టిన తరువాత కూడా పీ వెంటనే, జంటనే కనిపెడుతూ ఉండేది దైవత్వము మాత్రమే. ఇట్టి నిత్య సత్యమైన దైవత్వాన్ని మనస్సులో దృఢం చేసుకోవాలి.

ఈ జనన మరణాలు కేవలం దేహమునకేగాని, ఆత్మకు కాదు. శిథిలమయ్యేవి లేక అభివృద్ధి పొందేవి దేవాలయాలు మాత్రమే గాని, భగవంతునికి ఇవి ఏవీ వర్తించవు. మానవులు తాము బ్రతికి యుండినంత వరకే ఒకరితో నొకరు సంబంధము కలిగి యుంటారు. తదుపరి ఎట్టి సంబంధము ఉండదు. మానవుడు పుట్టే సమయంలో ఇంత బట్టైనా తీసికొనిరాడు, మరణించే సమయంలో "అడ్రస్సు" (Address) అయినా ఇచ్చిపోడు, "ఎవరికి వారే యమునా తీరే". కాని దేహాన్ని ధరించి యుండినంత వరకు మన కర్తవ్యాన్ని మనం నిర్వర్తించాలి. దేహరీత్యా కలిగే సంబంధ బాంధవ్యాలను మనం అనుభవించాలి. కాని ఇవన్నీ ఏనాటికైనా వదలి పోవునవే. నేడు కాకపోతే ఇంకొక 50 సంవత్సరాలకైనా ఎడబాటు తప్పదు. అయితే, నీకు భగవంతునికి మధ్య ఎడబాటు అను నది క్షణమాత్రము ఉండదు. నీవు భగవంతుని మరచి నప్పటికి, భగవంతుడు నిన్ను మరువడు. అట్టి ప్రేమ మయమైన భగవత్తత్త్వాన్ని మనం పెంచుకోవాలి.

## " స్త్రీ " శబ్దానికి నిర్వచనం

దేవి అనగా స్త్రీ స్వరూపం. ఈ జగత్తంతా త్రిగుణాత్మక స్వరూపం. అయితే ఈ 'స్త్రీ' అనునది 'స' కార, 'త' కార, 'ర' కారములతో చేరియుంటు న్నది. 'స' కారము సాత్వికమును గుర్తింపజేస్తున్నది. సాత్వికగుణము ప్రప్రథమంగా ఆవిర్భవించేది తల్లి నుండియే. తల్లి తన రక్తమును ప్రేమ మయంగా మార్చి బిడ్డలకందిస్తుంది. కనుకనే తల్లి ప్రేమను వర్ణించి చెప్పుటకు వీలుకాదు. రెండవది: తకారము. బిడియము, అభిమానము మొదలగునవి తకారమునకు చెందిన లక్షణాలు. స్త్రీలలో సిగ్గుపడే గుణము అమితంగా ఉంటుంది వారు తమ గౌరవ మర్యాదల కోసం నిరంతరం పాటుపడుతుంటారు. స్త్రీలు ఇట్టి పవిత్రమైన గుణములను కలిగినటువంటివారు- అని ఈ తకారము సూచిస్తుంది. అంతేగాని, తినడం- నిద్రించడం వంటి లక్షణాలను కలిగియుండుట కాదు. మూడ-డి: రకారము. ఇది రాజసిక లక్షణాన్ని గుర్తింపజేస్తుంది. స్త్రీల యందు అమితంగా ఉండే త్యాగము. ఔదార్యము వంటి గుణాలు రకారమునకు సంబంధించి నవే స్త్రీలు కష్టనష్టాలకు విచారించక, తమ గౌరవాన్ని నిలుపుకొనే నిమిత్తమై ఎట్టి త్యాగానికైనా పాల్ప డుతారు, అవసరం వస్తే ప్రాణ త్యాగానికైనా వెను దీయరు. సాత్వికమునకు విరుద్ధముగా దండెత్తివచ్చే తమోగుణములను నిర్మూలించడానికి తాము నిరంతరం సంసిద్ధులై ఉంటారు. కనుక 'దేవి'- అనగా రజో గుణాన్ని ధరించి దుర్గుణాలను నిర్మూలం గావించి, సాత్వికమును పోషించే శక్తి స్వరూపిణియే.

## కుంకుమపూజ

ఈ లోకములో మానవులు స్వార్థ స్వప్రయోజనాలతో, ప్రేమరహితులై ప్రవర్తించే సమయంలో ఈ శక్తి స్వరూపిణీయైన ఆత్మతత్త్వము రజోగుణమును ధరించి దుర్గుణాలను నాశనం చేసింది. ఇదియే "దసరా" పండుగ యొక్క అంతరార్థము. ఈ విధముగా దుర్గుణాలను నిర్మూలించినప్పుడు దేవి మహా రౌద్రాకారమును ధరించింది. ఈ దేవి యొక్క ఉద్రేకాన్ని చల్లార్చే నిమిత్తమై ఆమె సంతతి వారైన స్త్రీలందరూ ఎఱ్ఱ కుంకుమతో అర్చనలు గావించారు. దీని అంతరార్థమేమనగా— ఆ తల్లి ఈ రక్తవర్ణంతో కూడిన కుంకుమను చూచి దుర్మార్గులందరూ అణగిపోయారని తలంచి, శాంతపడుతుందట. కనుక, ఈ కుంకుమపూజ దేవి యొక్క రౌద్రాన్ని చల్లార్చే నిమిత్తమై జరుపబడుతుందని దీనికి అర్థము.

## దేవుని శిక్షలు కూడా ప్రేమమయములే

రాక్షసులనగా ఒక ప్రత్యేకమైన స్వరూపము గలవారు కాదు. మన దుర్గుణాలు, దుర్భావాలే— "రాక్షసులు". ఈ రాక్షస నాయకుడైన రావణాసురుడు పదితలలు కలిగినవాడని మనం భావిస్తున్నాము. రావణుడు పదితలలతో పుట్టలేదు. ఏమిటీ పది తలలు? కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు, మనస్సు-బుద్ధి-చిత్తము-అహంకారము— ఈ పది గుణములతో కూడినవాడే రావణాసురుడు. అతనికి ఈ ఒక్కొక్క గుణము ఒక్కొక్క శిరస్సుగా రూపొందుతూ వచ్చింది. కనుక, ఎవరికి వారు "నేను రాముడనా? రావణాసురుడనా?" అని విచారణ చేసికోవాలి. రామచంద్రుడు ఈ రావణుని ఒక్కొక్క శిరస్సును (అనగా ఒక్కొక్క దుర్గుణాన్ని) ఖండిస్తూ వచ్చాడు. ఈ దుర్గుణములను సంహరించేవాడు కూడా భగవంతుడే. అయితే దుర్గుణాలను నాశనం చేసే సమయంలో రజోగుణ స్వరూపాన్ని ధరిస్తాడు. ఈ రజోగుణము కూడనూ సాత్వికముతో కూడినటువంటిదే. రామునికి రావణునిపై ప్రేమ, దయ ఉండుట చేతనే అతని దుర్గుణాలను నిర్మూలం గావించాడు. ప్రేమయే లేకుండా దుర్గుణాలను దూరం చేయుటకు వీలుకాదు. కనుక ఈ రజోగుణములోపల కూడా సాత్వికము చేరియుంటున్నది.

కేవలం దేశ కాల పరిస్థితులను పురస్కరించుకొనియే భగవంతుడు ఆయా కర్మలను ఆచరిస్తుంటాడు. వెన్నను వ్రేలితో నొక్కవచ్చుగాని, ఇనుమును సుత్తితోనే కొట్టాలి. భగవంతుడు సాత్వికమైన హృదయాలను సాత్వికంతోనే సమీపిస్తుంటాడు, రజోగుణ సంబంధమైన హృదయాలకు రజోగుణ సంబంధమైన శిక్షలనే ఇస్తుంటాడు. భగవంతునిది— రుద్రాకారమని, భద్రాకారమని అనేకరకాలైన పేర్లను ఉచ్చరిస్తున్నాము, కాని ఇవన్నీ సరియైనవి కావు. భగవంతునికి ఒక్కటే సరియైన పేరు కలదు. అదే "ప్రేమస్వరూపం".

కనుక ఈ ప్రపంచాన్ని మనం భౌతికమైన దృష్టితో చూడకూడదు. ప్రేమ దృష్టితోనే చూడాలి. అప్పుడే మనలో ప్రేమతత్త్వం ఆవిర్భవిస్తుంది. భారతీయుల యొక్క ప్రతి పర్వదినం కూడా పవిత్రమైన ప్రేమతత్త్వాన్ని ప్రజల కందించే నిమిత్తమై ఏర్పడినవే, ఇట్టి ప్రేమతత్త్వాన్ని ప్రజలకు చాటే నిమిత్తమై పరమాత్ముడు అవతరిస్తుంటాడు. సర్వజీవుల యెడల ప్రేమను కలిగియుండాలని బోధిస్తుంటాడు. తాను ప్రేమించి, ఇతరులను కూడా ప్రేమించమని తెలుపుతుంటాడు. కనుక మానవ జీవితాన్ని ప్రేమయందే ఆనందంగా అనుభవించాలి.

—శ్రీవారి దివ్యబోధ
18—10—1991,
బృందావనం.

# సాయి లక్ష్మి



శ్రీ వేదాంత కళావతీ ! భగవతీ ! శ్రీసూక్త ముక్తావళీ !
దేవానీకనుతాంఘ్రి పద్మ యుగళా ! ధీమత్ కళామంగళా !
లావణ్యాంగి ! సముద్ర రాజతనయా ! లాస్యప్రియా ! హేజయా !
శ్రీ విష్ణు ప్రియ ! వందనీయ ! వరలక్ష్మి ! సత్య సాయీశ్వరీ !

వర చామీకర వర్ణినీ ! మణిఖనీ ! వాత్సల్య చింతామణీ !
వర లోకైక హితైషిణీ ! సురమణీ ! నారాయణీ ! హే భయం
కర సంతాప నివారిణీ ! వితరణీ ! కారుణ్య సంవర్షిణీ !
స్మరి యింతున్ నిను ఆదిలక్ష్మి ! జగదంబా ! సత్య సాయీశ్వరీ !

భవరోగార్తి నివారిణీ ! సకల సంపల్లాభ సంధాయినీ !
నవ కోశాది వరిష్ఠ భోగ విభవా సందైక ! సంవర్ధినీ !
దివిజాధీశ విధాత సేవ్య జననీ ! దేదీప్య చంద్రాస్య ! సం
స్తవముల్ చేసెద భాగ్యలక్ష్మి ! జగదంబా ! సత్య సాయీశ్వరీ !

సుమనో రంజని ! సర్వలోక జననీ ! శుద్ధాంత సీమంతినీ !
రమణీ ! మంగళ రూపిణీ ! నుతగుణీ ! రత్నాకరోత్సాహినీ !
కమలాక్షీ ! శతరాజ పూజితపదా ! కామ్యప్రదా ! భక్తిదా !
మము పాలింపవె మోక్షలక్ష్మి ! జగదంబా ! సత్య సాయీశ్వరీ !

ప్రణవంబుల్ జపియించుచున్ - శ్రుతుల నారాధించుచున్ - నామనో
మణి పీఠోపరి నిల్పి కొల్చెద రమా ! మాంగల్య మాణిక్య భూ
షణరాజ్ఞీ ! అఘ హారిణీ ! సుజన వాంఛాదాయినీ ! మానినీ !
ప్రణతుల్ సేతును ధైర్యలక్ష్మి ! జగదంబా ! సత్య సాయీశ్వరీ !

— "శాంతిశ్రీ" జంధ్యాల వేంకటేశ్వర శాస్త్రి, ప్రశాంతినిలయం.

## సాయి అభయహస్తం

బాలుర మధ్యలో బాలుడై వర్తించు
బాల భానుడు గాదె 'పర్తిసాయి'
మాతృమూర్తులమధ్య మాతయైగన్పట్టు
జగదంబయగుగాదె "సాయిమాత!"
పురుషుల మధ్యలో పురుషుండుగా నుండు
పురుషోత్తముడుగాదె "పూజ్యసాయి"
ఏకాంతమందున ఎవ్వారికందని
జగదీశ్వరుడుగాదె "సత్యసాయి"

సత్య - ధర్మ - ప్రేమ - శాంతిసుఖంబులు
ప్రేమమీర పంచిపెట్టు "సాయి"
"అభయహస్త"మెత్తి ఆశీర్వదించిన
చాలును ఇపుడున్న జన్మచాలు!

## సాయిబాట

పాండిత్య ప్రతిభతో పండిన వారైన
సాయి ప్రతిభ జూచి సంభ్రపడరె!
గాత్ర మాధురి గల్గి గానకోవిదులైన
సాయిగానంబుతో చప్పబడరె!
వైద్యవృత్తిలో కడు వృద్ధులైననుగాని
"సాయిమందు"కు చేయి సాచవలదె
న్యాయశాస్త్రములెల్ల నమలిన వారైన
స్వామి తీర్పుకు కట్టుబడవలదె!

సకల విద్యలందు శాస్త్రంబు లందును
లీలలందు ఎదురులేనె లేనె
"సాయిబాట"లోన సాగిపోగల్గిన
చాలును ఇపుడున్న జన్మచాలు!

—ఏకా. రామచంద్రరావు,
గణపవరం.

## సాయి పాదుకాస్తవం

శ్రీదయిత దివ్యపాద
ప్రాదుర్భూతాభ్రి గాంగ పరివేష్టితముల్
మోదప్రద వేద ప్రీతి
పాదితములు గొలుతు సాయి పాదుకలనెదన్!

కలిదోష సంతరణములు
కలితాశేష విభవములు కామ్యప్రదముల్
సులభాశ్రయములు శ్రేయః
ఫలములు మది సత్యసాయి పాదుకలెంతున్!

భరతావనీ సుజన ని
ర్భరతా పోషక మనములు ప్రహ్లాదంబుల్
భరత శిరోధార్యంబులు
పరమానందములు సాయిపాదుకలెంతున్!

సత్యాధీనము సర్వము
సత్యము నుద్ధృత మొనర్చు సమ్యగ్రీతిన్
నిత్యము స్మృతిపథ గతములు
ప్రత్యక్షము లివిగో! సాయిపాదుక లిపటన్!

బ్రాహ్మీ వర ప్రభావిత
బ్రహ్మానందానుభవము ప్రమదాశ్రువులై
బ్రహ్మజ్ఞాన ఫలంబును
బ్రహ్మపదము జూపు సాయిపాదుకలెంతున్!

సర్వవ్యాపక పదములు
సర్వ ప్రకృతి ప్రశస్త సంచాలకముల్
సర్వారాధ్యుని పాదుక
లుర్విన్ జనావనంబులో ముతమమ్మున్!

—చల్లా సూర్యకామేశ్వరరావు,
నరసాపురం.

# శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్ట్, ప్రశాంతినిలయం.

## ప్రస్తుతం లభ్యమయ్యే మా ఇతర పుస్తకములు

| | పేరు | ధర | సాధారణ తపాలా ఖర్చు |
|---|---|---|---|
| | తెలుగు ప్రచురణలు : | రూ. | రూ. |
| 1. | ఉపనిషత్ వాహిని | 5-00 | 1-00 |
| 2. | గీతావాహిని | 14-00 | 1-50 |
| 3. | ధర్మవాహిని | 7 00 | 1-00 |
| 4. | ప్రశాంతివాహిని | 4-00 | 1-00 |
| 5. | ప్రశ్నోత్తరవాహిని | 4-00 | 1-00 |
| 6. | భాగవత వాహిని | 14-00 | 1-50 |
| 7. | రామకథా రసవాహిని (1వ భాగం) | 13-00 | 2-00 |
| 8. | రామకథా రసవాహిని (2వ భాగం) | 10-00 | 1-50 |
| 9. | లీలాకైవల్యవాహిని | 4-50 | 0-50 |
| 10. | సత్యసాయి వాహిని | 11-00 | 1-00 |
| 11. | జ్ఞానవాహిని | 7-00 | 1-00 |
| 12. | ధ్యానవాహిని | 7-00 | 1-00 |
| 13. | ప్రేమవాహిని | 7-00 | 1-00 |
| 14. | విద్యావాహిని | 7-00 | 1-00 |
| 15. | సూత్రవాహిని | 4-50 | 0-50 |
| | తెలుగు ప్రచురణలు : | రూ. | రూ. |
| 16 | అద్భుతమూర్తి | 15-00 | 1-00 |
| 17 | ఆత్మారామమ్ | 20-00 | 2-00 |
| 18. | శ్రీ సత్యసాయి దివ్యబోధ | 10-00 | 1-00 |
| 19. | నీలగిరి వేసవి వెన్నెల | 6-00 | 1-50 |
| 20. | రత్నావళి | 8-50 | 1-00 |
| 21 | మనస్సుమర్మము | 5-00 | 1-00 |
| 22 | సందేహ నివారిణి | 6-00 | 1-50 |
| 23. | చిన్నకథ (1వ భాగం) | 10-00 | 1-00 |
| 24 | చిన్నకథ (2వ భాగం) | 10-00 | 1-00 |
| 25 | సత్యం శివం సుందరం (1వభాగం) | 14-50 | 1-50 |
| 26. | సత్యం శివం సుందరం (2వభాగం) | 15-00 | 1-50 |
| 27. | సత్యం శివం సుందరం(3వ భాగం) | 14.00 | 1.50 |
| 28 | యుగావతారి సాయిబాబా | 30-75 | 1-50 |
| 29. | మణిమాల | 10-00 | 1-0 |
| 30. | వచనామృతము 1984 | 17-50 | 2-00 |

(ఎ) పుస్తకములు రిజిస్టర్డ్ పోస్టులో మాత్రమే పంపబడును.

(బి) స్వదేశీదారులు 6 పుస్తకములకు లేక తక్కువ పుస్తకములకు రిజిస్ట్రేషన్ చార్జీలు రూ. 6-00 చొప్పున, పుస్తకముల ధరలకు; సాధారణ తపాలా ఖర్చులను చేర్చి పంపవలెను. పుస్తకముల కొరకు పంపే మొత్తం డబ్బు— "కన్వీనర్, శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్ట్. ప్రశాంతినిలయం-పోస్టు, అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్. పిన్‌కోడ్ — 515 134" అనే చిరునామాకు పంపవలెను.

(సి) పుస్తకముల కొరకు పంపే పైకం కేవలం మనియార్డరుద్వారా గాని, బ్యాంక్ డ్రాఫ్ట్‌ద్వారా గాని కన్వీనర్‌గారి పేరున పంపవలెను. నగదుగాని, కరెన్సీకాని సామాన్యతపాల లేదా, రిజిస్టర్డ్ తపాలాలో పంపించడం చట్టవిరుద్ధం. ఆ మొత్తము ప్రభుత్వమువారు జప్తు చేయగలరు.

(డి) పోస్టు ఖర్చులవివరాలు—విదేశాలకు.

i) ఓడమీద పంపడానికి: రూ. 52/— U S $ 3.00, £ 2.00

ii) విమానంమీద పంపడానికి: రూ. 200/— U S. $ 12.00, £ 7.00